# కృష్ణవేణి



చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచే
రచియింపబడినది



పబ్లిషర్సు :
కొండపల్లి వీరవెంకయ్యా అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

 [వెల 0—12—0

# కృష్ణవేణి

## మొదటి ప్రకరణము

పూర్వకాలము బెజవాడకు విజయవాటిక యని పేరు. తెనుఁగుదేశము తురకలస్వాధీనమైనతరువాత విజయవాటిక యనుపేరు కాలక్రమమున మాఱిపోయి బెజవాడ యని వ్యవహరింపఁబడుచు వచ్చెను. ఆనామమె యిప్పటికిని వాడుకొనఁబడుచున్నది. ఈ కథ జరిగిన కాలమున బెజవాడ చిన్న గ్రామము. అప్పుడు తెనుఁగు దేశమంతయు గోలకొండ నవాబుల పరిపాలనమం దుండెను. తానీసా యని తెనుఁగు దేశపు జనులచేతఁ బేర్కొనఁబడుచున్న అబ్దుల్ హసాము తానాషా యాకాలమున గోలుకొండను బాలించుచుండెను. గోలుకొండ తెనుఁగుదేశమునకుఁ జిరకాలము రాజధానియై మహైశ్వర్యమనుభవించెను. ఈపట్టణము పూర్వము కాకతీయ ప్రతాపరుద్రుని యోరుగల్లు సామ్రాజ్యములో నొక ప్రధాన నగరమై కాకతీయులు పడిపోయినతరువాత మహమ్మదీయుల యధీనమై యనంతరము రాజధానియై వన్నెకెక్కెను. ఇప్పు డీనగరము హైదరాబాదు నిజాముగారి రాజ్యములో నున్నది, ఒకానొకప్పుడు భరతఖండ మంతటఁ బేరుపడి సకల సౌందర్యము

లకు నాస్పదంబై యుండిన యానగర మిప్పుడు శోభలఁ దొఱంగి పేదపడియున్న యీయవస్థఁ జూడ నైదవతనము గోలుపోయిన స్త్రీయవస్థ జ్ఞప్తికి వచ్చును. 1675 వ సంవత్సరమున నొకనాఁడు తెల్లవారుజామున రంగరాజను క్షత్రియుఁడు భార్యయగు కనకవల్లిని నైదుసంవత్సరములఁ బ్రాయముగల చిన్నకూఁతును దీసికొని స్వగ్రామమైన విజయవాడను విడిచి గోల్కొండకుఁ బయన మయ్యెను. తల్లియుఁ గూఁతురు పని కత్తెయు నొకబండిలోఁ గూరుచుండిరి. రంగరా జొకఁడు రెండవబండిలో గూరుచుండెను. బండివెనుక సేవకుఁడు నడచుచుండెను. కనకవల్లియొక్క యాభరణములు చీరలు రంగరాజుయొక్క వెండిచెంబులు గిన్నెలు మొదలగు విలువయైన వస్తువులుగల పెట్టెలు రంగరాజు బండిలోనే యుండెను. రంగరాజునకు శూరశిఖామణి యని ప్రతిష్ఠయు గోల్కొండ నవాబువద్ద కొలువును దెచ్చిన పెద్దకత్తి బండిలో నాతని ప్రక్కనే యుండెను. తెల్లవారుజామున బండ్లు కట్టించి పయనముచేసి జాము ప్రొద్దెక్కునప్పటికి రంగరాజు కొండపల్లె చేరెను. కొండపల్లెలో గోల్కొండ నవాబుల ఖిల్లాయుండెను. ఖిల్లాయనఁగాఁ గోట. అక్కడఁ గోట పాలించుటకు ఖిల్లాదారొకఁడుండెను. రంగరాజు పయన మాఁపుచేసి యాపూఁట నచ్చట విడిసి వంటచేయించుకొని భోజనముచేసి ఖిల్లాదారునిఁ జూచి మాటలాడి జాముప్రొద్దువేళ బండ్లు కట్టించెను. బెజవాడ మొదలుకొని చాలదూరమువరకు దేశము పర్వతప్రాంత

మని చదువరు లెఱుంగుదురు. ఇప్పటివలె రాజబాటలు లేవు. కొండలనడుమనుండియు దట్టములగు నడవుల నడుమనుండియు బాటసారులు తరచు ప్రయాణములు చేయవలసిన యాదినములలోఁ బ్రతిస్థలము భయస్థానమనియు దారులుకొట్టు దోఁపిడికాండ్రు ఘాతుకకర్మలు చేయుటకుఁ గావలసినంత యవకాశ ముండుననియు వేరుగఁ జెప్పనక్కఱ లేదు. సూర్యాస్తమయమగునప్పటికి బండ్లొక చిన్నగ్రామమువద్దకుఁ బోయెను. బండివాండ్రు వెంటనున్న సేవకుఁడును బయన మాపూఁట కాఁపివేయుదమని రంగరాజుతో మనవిచేసిరి. కాని యాతఁడు దాని కంగీకరింపక "యీగ్రామమున మనము బసచేయుటకైన దగినతావు దొరకదు, ఎదుటనున్న యాగ్రామమునకుఁ బోయితిమా మనకు మంచివసతి గలుగును. అక్కడ నేనెఱిఁగిన గృహస్థులిద్దఱు ముగ్గురు గలరు. వారు నాకు సకలసౌకర్యములు నొసగూర్తురు. కొంచెముసేపు కనులు మూసికొని కాలక్షేపము జేసితిమేని యాగ్రామముఁ జేరఁ గలము. అది రెండు క్రోసులకంటె నెక్కువదూరము లే"దని ప్రయాణ మాపూఁటకుఁ దన యనిష్టమును సూపుటయు బండివాండ్రు సేవకుఁడు యజమానునితో మాఱుమాటాడ జాలక యూరకుండిరి. కనకవల్లి తనమాట భర్త తప్పక వినునని యూహించి రెండవబండిలోనుండి మెల్లగ భర్తతో నిట్లనియెను. "ఆయూరికి మనము కాఱడవిలోనుండి ప్రయాణము సేయవలెనఁట. మగవారు సాహసులు గావున నొంటిగఁ

బోవునప్పుడు సూర్యాస్తమయ మయిన తరువాత ప్రయాణము చేయవచ్చునుగాని యూడువాండ్రతో బిడ్డలతో నిట్టి సమయముల నిట్టిదారులలో బయనములు చేయగూడదు. ఇది యూరుగాని మూలపల్లెగాదుకదా. అందుచేత బసదొరకక పోదు. కాకపోయినను మనకెంత బసకావలయును? గది దొరకినసరే, లేనిచో నొకచావడి దొరకినను మనమేదో విధముగ నందులో గాలక్షేపము చేయగలము. కాబట్టి నామనవి విని యీరాత్రి మనమిచ్చట ప్రయాణమాపుటకు సెలవిండు.'' అనవుడు రంగరాజు కఠినస్వరముతో నిట్లనియె. "తెలియనిదానవు తెలియనట్లూరకుండుము సూర్యాస్తమయ మయినను వెలుతురింకనున్నది. ఆఱుగురు మనుష్యులున్నారు. ఇంతలోనే మనకు మహాప్రళయము సంభవించునా? కొండ విఱిగి మీఁదబడదలచుకొన్నపు డెవఁడాఁపగలడు? తోలుఁడు బండ్లు తోలుఁడు వెట్టివెట్టి మాటలు చెప్పి యాలస్యము చేయ వద్దు.'' అనగానె బండివాండ్రెద్దులను దోలనారంభించిరి. ఎద్దుల మెడలలో ఖంగుఖంగుమని గంటలు మొఱయఁజొచ్చెను గమ్యస్థానము మిక్కిలి వేగముగఁ జేరవలయునని బండివాండ్రు తమ యెద్దులను బలుమారు కొట్టియుఁ దోఁకమెలివెట్టియుఁ బప్పాయని హెచ్చరించియుఁ ద్వరపెట్టఁజొచ్చిరి. బండ్లు విసురుగ నడచుటచే నెగుడుదిగుడు తావులలో నెక్కిపడునప్పుడు ప్రమాదము గలుగకుండ కనకవల్లి యొకచేతిలో వసికట్టు పట్టుకొని రెండవచేతితో బిడ్డనుగట్టిగాఁ గౌఁగిలించుకొని కూర్చుండెను. పనికత్తెయైన మాచియు రెండుచేతులతో వసికట్టులు

పట్టుకొని కనకవల్లికంటె నెక్కుడు భయపడుచు బయలు దేర నప్పుడు తనకు నెత్తిమీఁద నూనెకుండ బెట్టుకొని తెలుకుల గంగన్న యెదురుగా వచ్చినాఁడని "వాఁడి మొగముమండ వాడి మొగము చూచినందుకు నాకేమి యాపదవచ్చునో" అని నిందించుచు బ్రాణము లుగ్గబట్టుకొని కూర్చుండెను. చీకటి పడెను. అన్ని దెసల వ్యాపించిన యంధకారము రంగరాజునకు దప్ప దక్కినవారి కందఱకు మిక్కిలి భయము గొలిపెను.

---

## రెండవ ప్రకరణము

---

ఎల్లయెడల నంధకారము వ్యాపించునట్లు కనకవల్లి యొక్కయుఁ బుత్రికయొక్కయు హృదయములయందు భయము వ్యాపించెను. ఈ రెండుబండ్లు బండ్లమీఁదనున్న మనుష్యులు బండివెనుకనున్న చాకలి నీలిగాఁడుతక్క తక్కినమనుష్యులెవ్వరును మార్గమధ్యమునఁ గనఁబడుట లేదు. ఉన్నతప్రదేశమునుండి నిమ్నప్రదేశమునకు బండిపోయినప్పుడు కలిగెడు చప్పుడులు, రాళ్ళమీఁదనుండి బండిపోవునప్పుడు కలుగు పటపటనాదము, క్రిందుగా వంగియున్న చెట్లకొమ్మలకు బండి గూడు రాచికొన్నప్పుడు కలిగెడు బరబరధ్వని తప్ప యితర ధ్వనులు విశేషముగ వినబడుట లేదు. చెట్లమీఁద స్థలము నిమిత్తమై పోరాడుకొను పులుఁగుల ధ్వనిమాత్రము నడుమ

నడుమఁ గొంచెము వినఁబడఁ జొచ్చెను. నీలిగానికిఁ గూడ మనసులో భయ ముదయించినందున వానికిఁ జిన్ననాఁట నుండియు వచ్చిన రెండుపదములు పాడుకొన వలయునని మనసులో నుండెను. కాని యజమానుఁడు సమీపమునం దుండుటచేత నట్టి పాటలు పాడిన నతఁ డేమనునోయని భయ మున సాహసించి పాడఁజాలకపోయెను. అట్లు కొంతదూరము బండ్లు నడచిన తరువాత వెనుకబండిలోనున్న కూఁతురు కంఠ మెత్తి "బాబయ్యగారూ! నాకును మాయమ్మకును భయము వేయుచున్నది. మీరువచ్చి మాబండిలోఁ గూర్చుండరాదా" యని కేకవేసెను. ఆమాటలువిని రంగరాజు "భయమేమి టమ్మా! పిచ్చిపిల్లవు. మీయమ్మ యొడిలోఁ బండుకొని నిద్ర పొమ్ము. భయములేదు గియములే"దని బదులుచెప్పి యా బండివెనుక జాగ్రత్తగా నుండుమని నీలిగానిఁ బంపెను. ఇట్లు కొంతదూరము బండ్లు సాగివెళ్ళునప్పటికి చీఁకటి దట్టముగా వ్యాపించెను. గ్రామము బరువుగ నఱక్రోసుదూర ముండెను. ఆయడవి దాఁటిన తరువాత గ్రామసంబంధమైన పొలముల జూడవచ్చునని రంగరాజు మనసులోఁ దలంచుచుండెను. ఎదు టగ్రామ మెంతదూరమున్నదని కనకవల్లి నడుమనడుమ నీలి గాని నడుగఁగా వాఁడు తెలియక తెలియదని చెప్పినచో బాగుండదని రెండుక్రోసు లున్నదని యొకమారు క్రోసున్నర యున్నదని యొకమారు చిత్తమువచ్చినట్లు చెప్పి యాస్త్రీల భయమును వృద్ధిచేయఁ జొచ్చెను. ఉబుసుపోవుటకై మాంచి చిన్నకథచెప్పి కనకవల్లిని గూఁతును నడుమనడుమ కొంచెము

నవ్వించెను. అంతలోఁ గొంత దూరమున మనుష్యుల యడు గుల చప్పుడు తైన్నట్లు చెవులఁబడెను. అవి యంతకంతకు సమీపముగ వినఁబడెను. ఎవరైన నుందురాయని వీరంద రాలోచించుచుండగాఁ బదునైదుగురు మనుష్యులు రెండు కాగడాలు వేయించుకొని యొకమలుపు తిరిగి మొదటిబండి యెదుట నిరువదిగజముల దూరములో, గనబడిరి. కొందరి చేతులలోఁ గత్తులు, కొందఱిచేతులలో విండ్లు నమ్ములు నుండెను. వారినిఁ జూడఁగానె కనకవల్లి గుండెలు చెదరి పోయెను. పిల్ల "అమ్మోభయ" మని తల్లిని గౌగలించు కొనెను. మాచి మిక్కిలి భయమున "అమ్మోలమ్మో" యని యఱవఁజొచ్చెను. కాని కనకవల్లి యంతలో ధైర్యమూ ష్చకొని "యఱవఁబో కఱపబో"కని మందలించెను. అంతలో దొంగలు బండిని సమీపించిరి. అందులో నిద్దఱు దీర్ఘకాయులు విసవిస ముందుకువచ్చి మొదటబండిఁ నాపిరి. మూడవవాఁడు పోలులోఁ గూర్చుండిన బండివానిని జుట్టుపట్టు కొని క్రిందఁ బడవైచెను. మఱిముగ్గురు మొదటిబండి ప్రక్క నుండి రెండవ బండికడకుఁబోయి బండివానిని గ్రిందకుఁ బడలాగి యెద్దులను విప్పి వేసి బండిలోనున్న స్త్రీలను దిగుమని యాజ్ఞాపించిరి. వారెవ్వరో మొట్టమొదట తెలియమిం జేసి రంగరాజు కొంత యాలస్యము చేసెను. కాని వారు తనబండి నాఁపుటయు నంతకంటె దారుణముగ స్త్రీలబండి నాఁపు టయుఁ జూచినతోడనే వారు బందిపోటుదొంగలని గ్రహించి యొరలోనుండి ఖడ్గముదీసి గుభాలున నేలకురికి స్త్రీలబండి యాఁపిన ముగ్గురలో నిద్దఱిని ఖడ్గముతో నఱికెను. మూడవ

వాఁ డదిచూచి వెనుకప్రక్కకుఁ బరుగెత్తెను. చచ్చిపోయి నాము బాబయ్యోయని మాచి పెద్దపెట్టున నేడ్చెను. కూఁతు నెత్తురుఁగొని కనకవల్లి యొక చెట్టుమూల గడగడ వడంకుచు నిలువబడియుండెను. రంగరాజు వెంటనే నీలిగానిని భార్య దగ్గఱ నుండుమని ముందునకు వచ్చి దొంగలపై బడెను. బండివాండ్ర చేతులు వెనుకకు దొంగలు విఱచి కట్టినందున వారు రంగరాజున కేసాయము చేయఁజాలరైరి. నీలిగాని చేతులు కట్టువడినను గట్టువడకపోయినను సమానమే. ఏలయన, వాఁడు చేయఁదగినపని యేదియును లేదు. రంగ రాజు దొంగలలో మరియిద్దఱిచేతులు నఱికియు నలుగురిని గాయపఱచియు నసాధారణ ప్రతాపము జూపెను. కాని పదునైదుగురిమీఁద నొక్కఁడుగదా! దూరమున నుండి యిద్దఱు రంగరాజుమీఁద నమ్ములు విడిచిరి. అవి రంగరాజు వక్షస్థలమున దగులుటచే నెత్తురు కారఁజొచ్చెను. ఇద్దఱు దొంగలు ఖడ్గములతో నాతని రెండుభుజములమీఁద గట్టి గాయములు చేసిరి. ఇంకను శరీరము మీఁద మఱికొన్ని గాయ ములు తగిలెను. కనకవల్లి చెట్టుచాటుననుండి భర్త యలసి పోవుచున్నాఁడనియు నొక క్షణములోనో యరక్షణములోనో పడిపోవచ్చుననియుఁ దెలిసికొని విచారగ్రస్త యయ్యెను. ఇఁక చేయునదేమి? అనుకొనుచు నామె చూచినతోడనే రంగరాజు మిక్కిలి మిసిమింతుఁడై నేలంగూలెను. చచ్చి పోయినాఁడురా చచ్చిపోయినాఁడురా యని దొంగలలో నొకడు రెండవవానితో బలికెను. ఆపలుకులు వినగానె కనకవల్లి మనస్సు వర్ణింపనలవిగాని యఖండదుఃఖ ప్రవాహ

మున ఁ బ్రవేశించి కడుదూరము గొట్టుకొనిపోయెను. మాచి చలిజ్వరము వచ్చినవానివలె వడవడ వడంకుచు నోట మాటరాక యేమియుందోచక వెఱ్ఱిదానివలె నిట్టటు పరు గిడఁజొచ్చెను. రంగరాజు పడిన తరువాత నిద్దఱు దొంగలు పెట్టెలు పగులగొట్టి యందలి ధనము స్వీకరించిరి. అప్పు డిద్దఱు దొంగలు కనకవల్లి సమీపమునకువచ్చి రావమ్మా మాసేనాధిపతి పిలుచుచున్నాఁడు రావమ్మా యని పిలిచిరి. "ఎవడురా మీసేనాధిపతి" యని యామె దుఃఖపూరితమైన కఠినస్వరముతో బదులుచెప్పెను. "ఈయడవులరాజు బండి గంగులను నీవెఱుఁగవా" యని యందులో నొకఁడు ప్రత్యు త్తర మిచ్చెను. "ఛీ! నీవు మీసేనాధిపతియు నవ్వలకుఁ బొండు, నేను రానని చెప్పు"మని యామె పలికెను. "రావా? యెందుకురావో చూత" మని వాఁడామె చెయిపట్టుకొని లాగెను. "ఎవఁడవురా నీవు చెయిపట్టుకొనిలాగెద" వని మొలలోనున్న వెండికట్టువేసిన కొమ్ముపిడికైజారు తీసికొని "మాచీ! కృష్ణవేణిని జాగ్రతపెట్టు" మని పలికి నిముషము లోఁ జేయిపట్టుకొన్న దొంగను గుండెయలోఁ బొడిచి నేల పాలుచేసి రెండవవాడు కత్తితో నఱకుటకై తనమీఁదికి వచ్చులోపలనె యాకైజారుతో దాను బొడిచికొని నేలఁ గూలెను. ఆహాహా! యేమి కృష్ణవేణి దురవస్థ. ఐదేండ్లు నిండకముందె లోకజ్ఞాన మించుకేనియు రాకముందె తల్లి దండ్రులు నేలపాలగుటయు దాను దొంగల పాలగుటయు సంభవించెను.

---

*

## మూఁడవ ప్రకరణము

కొండగంగులు జాతి కెఱుకలవాఁడు. చిన్ననాటనే వాఁడు మిక్కిలి సాహసుఁడై శౌర్యవంతుఁడై విలువిద్యయందు గడతేరి దనజాతిలో వేఁటయందు మొట్టమొదటివాడన గొప్పపేరువడసెను. ఇరువదిరెండేండ్లవయసు వచ్చినతరువాతఁ బడుచుదనపు గర్వముచేత మిక్కిలి పొగరెక్కి గంగులు తనవలెనే మొండితనమునందును సాహసకృత్యములయందు బేరువడిన నేస్తగాండ్రఁ గొందఱిని జేర్చుకొని కొండపల్లెవఱకుఁ గల దేశములందు దారులుగొట్టుచు బందిపోటు దొంగతనములు చేయుచుఁ దనపేరు విన్నంతమాత్రముచేతనే మార్గస్థులు గడగడవడంకునట్లు ప్రవర్తించుచుండెను. ఈకారణముచేత ప్రయాణముచేయు వారాకాలమున సూర్యాస్తమయము గాకముందే దేదో గ్రామముజేరి యచట విశ్రమించి మరునాఁడు సూర్యోదయమైన తరువాతగాని తిరిగి ప్రయాణము సేయరు. ఈభయముచేతనే ప్రయాణము చీఁకటిపడకముందె సాగి వేయవలసినదని కనకవల్లి భర్తను బ్రతిమాలుకొనెను. రంగరాజు భయ మెఱుంగనివాఁడగుటచే తన బాహుబలమునందు నమ్మికగలవాఁడగుటచే నంతలోఁ దన కేవిధమైన ప్రమాదము సంభవింపదని నమ్మి పయనము సాగించెను. కాని కొండగంగులు కొండలలోనుండి తన మూఁకతోఁ గొండవిఱిగి పడినట్లు వారిపైఁబడి గొప్ప

గాలిపెట్టుపూవులు చిగుళ్లు కాయలుపండ్లు గలిగి కలకలలాడు చుండు వృక్షము నొక్కపెట్టున నేలంగూల్చినట్లు,పండువంటి రంగరాజు సంసారము నొక్కదెబ్బలో రూపుమాపెను. చేయి పట్టుకొనిలాగిన దుండగిని ప్రాణంబుల హరియించి తన్నుఁ దాబాడిచికొంపి తల్లి నేలగూలినతోడనే కృష్ణవేణి భయముచే వడఁకి మాచికంఠము గట్టిగాఁ గౌఁగిలించుకొని "అమ్మా" యని వెక్కివెక్కి యేడ్వఁజొచ్చెను.యజమానునియొక్కయు యజమానురాలియొక్కయు దారుణమరణంబులు కన్నులారఁ జూచి దిక్కులేక తన గొంతుకఁ గౌఁగిలించుకొని విలపించు చున్న యాబాలికం జూచిమొలుగుఁగొడ్లవలె నల్లని విగ్రహ ములతో దన్నుజుట్టుముట్టియున్న యాదొంగలజూచి తనకుఁ బట్టదలఁచియున్న దురవస్థ జూచి మాచి విషాదముచే భయ ముచే నేమియుం దోఁచకయుండ నంతలో నిరువురు దొంగలు సమీపమునకు వచ్చి "మాసేనాధిపతి పిలుచుచున్నాఁడు రా" యని పిలిచిరి. మాచి మాఱుమాటాడక తన మనస్సులో "కనకదుర్గ! మాతల్లీ! వచ్చినకష్టములు రానేవచ్చినవి. ఈపిల్ల ను నన్నుఁ గాపాడితివా, రెండుమేకపోతులను నీకు బలియిచ్చె ద"నని దండముపెట్టుకొని వారివెంటనడచిపోయెను. ఆదొంగ లిరువురు బాలికతోఁగూడ మాచిని రమారమి యే డడుగుల పొడవుగలిగి పొడవునకుం దగిన లావుగలిగి మద్యపానముచే నెఱ్ఱకన్నులు గలిగి తోడివాండ్రతో నేదో మాటలాడుచున్న యొకానొక మనుష్యునివద్దకు దోడ్కొనిపోయిరి. త్రాటిచెట్టు

వలెనున్న యీమనుష్యుని జూచినతోడనే మాచికి మీఁది ప్రాణములు మీఁదనె యెగిరిపోయెను. కృష్ణవేణి కాగడాల వెలుఁగున వానిఁ జూడలేక కన్నులు మూసికొని మాచిని మఱింత బిగ్గఁ గవుఁగలించుకొనియెను. ఆబిరుసుగడ్డమునాకోర మీసములు చింతనిప్పులవంటి యాకన్నులు భయంకరమైన యావిగ్రహము పిడుగుపాటువలె వినఁబడు వాని కంఠధ్వని ధైర్యముగల మగవారికె వెఱపుగొలుపుచుండ యజమానుని యజమానురాలినిఁ గోల్పడి మహాకష్టదశలో నున్న మాచికి సహజభీరురాలైన బాలికకు భయము గొలుపుట యొక యాశ్చర్యములోనిది కాదు. భయపడుచు దనయెదుట నిలిచిన మాచిని జూచి గంగులు "ఓసీ! నీదగ్గఱ, పిల్లదగ్గఱ మఱియే మైన సొమ్మున్నదా? ఎక్కడనైన దాచిన పక్షమున జెప్పు చెప్పకపోయిన కాగడాపెట్టి కాల్పించి నీచేతఁజెప్పించెద" నని బెదరించెను. ఆపలుకులు చెవిని బడగానే కృష్ణవేణి శరీరము భయముచేవడఁకి చెమటతోనిండిపోయెను. బాబయ్యా! నేను పిల్ల మీయధీనమైపోయినాము. తల్లిదండ్రులులేని యీపిల్లను దిక్కులేని నన్ను మీరేమిచేసినను జేయవచ్చును. ఈమెకాళ్ళ నున్న యందెలు, కడియములు, చేతినున్న మురుగులు, మెడ లోనున్న నానుకోళ్ళుపట్టెడ తప్ప మావద్ద నేవిధమైన సొత్తు మరిలేదు. తక్కినవి పెట్టెలో నున్నవి. మీచేతఁ జిక్కినవి. ఇంతకంటె సొమ్ములేదు. నేను దాఁచలేదు. దాచుటకైన వ్యవధానము లేదు. నన్నుఁ గాల్పించినను బేల్పించి

నను మీకు సొమ్ముమాత్రము దొరకదు. మీ సెలవైన పక్షమున నీబిడ్డను దీసికొని నేను దిరిగి బెజవాడ వెళ్ళెదను. ఈబిడ్డ కమ్మమ్మ మేనమామలు గలరు. వారికప్పగించివేసెదను. వారు గుంటూరులో నున్నారు. లేదా మీ చిత్తమెట్లో యట్లే చేసెద, తల్లిపోవునపుడు ''మాచీ! కృష్ణవేణి జాగ్రత యని చెప్పిపోయినది'' అని దుఃఖమాపు కొనలేక మాచి వలవల యేడ్చెను. దానియేడ్పుజూచి కృష్ణవేణి దుఃఖమాఁపుకొనలేక కన్నులు నులిమికొనుచు అమ్మా అమ్మా యని బాబయ్యా బాబయ్యా యని బిగ్గరగనేడ్చెను. పిడుగులు బ్రద్దలు చేయఁజాలని గొప్పకొండల నొకప్పుడు చల్లని నీటియొక్క వేగము భేదించును. అనేక నరహత్యలు బహు స్త్రీహత్యలు జేసి పలుపల్లియలం గాల్చి పలుగ్రామంబులఁ దోచి పెక్కుదారులుగొట్టి జీవహింసయె జీవనాధారముగ బ్రతికి కనికర మెట్టిదో యెఱుంగని యా కిరాతుల హృదయములు, స్త్రీల యాక్రందనధ్వనులకు సయితము దుర్భేద్యములైన యాహృదయములు, నల్లరాళ్ళకంటె కఠినములైన యాహృదయములు, కృష్ణవేణియొక్క దుఃఖము జూసినతోడనే కొంచెము మెత్తవడియెను. ఆహృదయములలోఁ గనికరము క్రొత్తగా నాటిదినముననే బ్రవేశించినది. ఆ హృదయము లాదినముననె మొట్టమొదటిసారి మెత్తపడినవి మానవరక్షణ మాదినముననె వారిహృదయముల మొలకలెత్తినది. ఒక్కక్షణ మందఱు నూరకుండిరి. తరువాత

గంగులు మాచినిఁ జూచి "ఓలమ్మా! నీకు నీపిల్లకు భయములేదు. నీవు బెజవాడ వెళ్ళవద్దు. కొండలలో మావద్దనె యుండు. మీకిద్దఱకుఁ గూడు గుడ్డ నేనిచ్చి పెంచుదును. నామాటకు నోరెత్తిజవాబు చెప్పవ"ద్దని పలికి సేవకులఁజూచి "ఒరే నాగులు, ఒరే గోగులు, బంధ్లు కట్టండి. వీళ్ళనిద్దఱిని బండిమీఁద నెక్కించి మన గూడెమునకుఁ దీసికొని రం" డని యాజ్ఞాపించెను.

---

## నాల్గవ ప్రకరణము

---

ఓరుగల్లు నగరములోనున్న పూఁటకూళ్ళయిండ్లలో మిక్కిలి ప్రసిద్ధికెక్కినది చుక్కల సోదెమ్మ యిల్లు. ఓరుగల్లు గణపతి దేవుని కాలమందు రుద్రమదేవి కాలమందుఁ బ్రతాపరుద్రుని కాలమందు నున్నంతమహావైభవమును గలిగియుండకపోయినను మనము వర్ణించు కాలమునాటికిఁ గూడ నది గోలకొండసామ్రాజ్యమున కొక ముఖ్యనగరమై యొకఖిల్లాదారునకు నివాసస్థానమై హిందువులకు మహమ్మదీయులకు వాసస్థానమై గోల్కొండనుండి యుత్తరసర్కారులతో జరుగు వాణిజ్యమునకు మధ్యస్థానమై యుండెను. అందుచేత రాజకార్యముల మీఁదను వ్యాపారముల మీఁదను జనులనేకులా నగరమునకు వచ్చుచుఁ బోవుచుందురు. మార్గస్థులు గూడ ప్రతిదినము వందలకొలఁది యాపట్టణమున బస దిగి సత్రము

లలోఁ బండుకొనియొ పూటకూళ్ళ యిండ్లలో ధనమిచ్చి భోజనము చేసియొ వెళ్ళుచుందురు. భోజనము నిమిత్తమై సోదెమ్మ యింటికి వెళ్ళినంతమంది యేయింటికిని వెళ్ళరు. భోజనము నిమిత్తమై వచ్చినవారికి బసకు స్నానమునకు నన్నపానములకుఁ దగిన యేర్పాటులు చేయుచుండుటయే దీనికి ముఖ్యకారణము. సోదెమ్మ పుట్టినింటివారి నివాసము పిల్లలమఱ్ఱి గ్రామము తలిదండ్రులు దారిద్ర్యవశమున సోదెమ్మను నాలుగేండ్ల ప్రాయమున నూఱునరాల సొమ్మాలిగా గ్రహించి యొక ముసలివాని కామెనిచ్చి వివాహము చేసిరి. వివాహమైన సంవత్సరము తిరుగకుండగనే సోదెమ్మ పెనిమిటి తన పేర శాశ్వతమైన నిశాని భార్యరూపమున లోకమున నుండుటచేతఁ దాను లేకపోయినను లోకముండదని తలంచి లోకాంతరగతుఁడయ్యెను. శుద్ధవైదిక కుటుంబమగుటచే బంధుగులధిక్షేపింతురను భయమునఁ దలిదండ్రులు సోదెమ్మకు బదియేనవయేటనే కేశఖండనము జేయింపఁ దలపెట్టగా నామె దాని కియ్యకొనక యిరుగుపొరుగున నున్న యిరువదియేండ్ల బ్రాహ్మణ బాలకుని సహాయము చేసికొని యర్ధరాత్రమున నిల్లు బయలుదేరి వెళ్ళి యెట్టకేల కోరుగల్లు నగరముఁ జేరి యక్కడ పదునైదు సంవత్సరములు కాలక్షేపముచేసి పిమ్మట దన్ను మొదట దీసికొని వచ్చిన బ్రాహ్మణుఁడు వివాహము జేసికొన స్వగృహమున కరుగగా జీవనాధారమేదియులేక పూటకూళ్ళుపెట్టి యావత్ప్రపంచములో బ్రసిద్ధిగాంచి తనపేరు గోలుకొండవరకు మ్రోగునట్లు తనయిల్లు మహా

న్నపూర్ణసత్రమును మించి నిరంతరాన్నదానముతో వెలయు నట్లు వ్యవహరించుచుండెను.

మొదటి మూడు ప్రకరణములలో జెప్పఁబడిన వృత్తాంతము జరిగిన పది సంవత్సరములకు నొక్కనాడు సోదెమ్మ గృహమందు రామరాజను నొక క్షత్రియుఁడు, వెంకటస్వామి యను కాఁపుకుర్రవాఁడు బసచేసి రెండుదినము లక్కడ నుండిరి. రామరాజు గోల్కొండనుండి కొండపల్లె వెళ్ళు చుండెను. వెంకటస్వామి రామరాజు సేవకుఁడు. ఆతఁడు చిన్ననాటనుండియు రామరాజు గృహమందె పెరిగెను. రామరాజు తండ్రి నరసింహరాజు గోలకొండలోఁ గాఁపుర ముండెను. నవాబు సైన్యములో నాతనికి గొప్ప యుద్యోగము. నరసింహరాజు మిక్కిలి భాగ్యవంతుఁడు. గోలకొండలో నాతనికి మిద్దెలు మేడలు తోటలు మెండుగ గలవు. గొప్ప జవాహిరి విశేషముగ రొక్కముగూడ గలదు. రామరాజు యొక్క మేనమామయగు రాఘవరాజు కొండపల్లె ఖిల్లా దారువద్ద నుద్యోగములో నుండెను. ఆయన కొంతకాలము నుండి రోగపీడితుఁడై యుండుటజేసి రామరాజు తల్లిప్రేరణ చేత దండ్రి అనుమతిం బడసి మేనమామను జూచుటకై పోవుచుండెను. రామరాజునకు వయస్సిరువదిమూడు సంవత్సరములు, స్ఫురద్రూపి, సంపూర్ణమైన యారోగ్యము గల మనుష్యుని శరీర మెంతయొప్పుగఁ బెరుగవలయునో రామరాజు శరీరము నంత యొప్పుగఁ బెరిగెను. తండ్రివలెనే రామరాజు గూడ పొడుగరి. పొడుగునకుఁ దగిన లావు గలిగియుం

డుటచే నాతని శరీరము సౌష్టవము కలిగి యెక్కడ నే భాగ మె
ట్లుండవలయునో యాభాగమ ట్లమరియుండెను. ఆతని ముఖ
వర్చస్సు జూచినవారందరు నరసింహరాజు రాజకుమారుఁ
డనియు భాగ్యవంతుఁ డనియు దెలియకపోయినను నాతఁడు
గొప్పవంశమునఁ బుట్టినవాఁడనియు గౌరవనీయు డనియు
దెలిసికొనకమానరు. కుడిచేతి చిటికెనవ్రేలికిబెట్టిన వజ్రపు
టుంగర మొకటి దప్ప దక్కిన యాభరణము లెవ్వియు
నాతనివద్ద లేకపోయినను నాతనిశరీరమే సకలాభరణములకు
నాభరణమై వెలయుచుండెను. ఆతఁ డోరుగల్లుఁ జేరి రెండు
దినము లక్కడనుండి పట్టణమంతయుఁ జూచెను. అబ్దుల్
హసాం తానాషాయొక్క సత్పరిపాలనముచేత గోలుకొండ
సామ్రాజ్యము మహావిభూతితోఁ దులదూగుచుండిన యోరు
గల్లునగరముగూడఁ గొంతయైశ్వర్యవంతమై యుండిన నీ
నగరముయొక్క ప్రాచీన మహోన్నతదశ తలంపునకుఁదెచ్చి
రామరాజునకు విషాదము గలిగించెను. ఓరుగల్లుసామ్రాజ్య
పరమేష్ఠియని చెప్పందగిన గణపతిదేవుని కొలువుకూటంబులు
లక్ష్మీపార్వతీసరస్వతుల సారంభముద్దయని యానాడు జనుల
చేతం గూడ సన్నుతి జేయబడుచు మిక్కిలి గౌరవంబున
కాస్పదురాలైన రుద్రమదేవికి మణికిపట్టులగు ప్రాతమేడలు
సంస్కృతాంధ్ర మహాకవులకు నిక్షేపంబులై త్రిలింగసా
మ్రాజ్య లక్ష్మికి రంగస్థలంబై కాకతీయ వంశస్థులకీర్తికాంతకు
విహారభూమియై యుండిన ప్రతాపరుద్రదేవుని యాస్థానము
నాతఁడు చూచి మొదటమెచ్చి తలయూఁచి కాలక్రమమున
వానికిగలిగిన దురవస్థకునెంతయు జింతించెను. మహమ్మదీయుల

హస్తములచేత నాశనముచేయబడిన పాడుదేవాలయంబుల నెన్నింటినోజూచి వాని పూర్వవైభవంబులందలంచియొక్కింత వగచెను. మొట్టమొదట మహమ్మదీయు లోరుగల్లుపై దండు విడిన కాలమునఁబ్రతాపరుద్రదేవుని సైన్యములోనుండి సైన్యమునకేగాక దేశమునకుగూడనలంకారభూతులయినరాచవారు కమ్మవారు వెలమవారు రెడ్డివారు మేనులు దాచికొనక యడుగడుగునకు మహమ్మదీయుల రాక నెదుర్కొని యాటంకపఱచి దేశము నిమిత్తమై ప్రభువు నిమిత్తమై ప్రతిష్ఠ నిమిత్తమై శరీరంబులఁ దృణప్రాయంబులుగ వదలివేసిన చోటులను దమరక్తధారలచేత దడపిన చోటులను జూచి కన్నీరు విడిచి "హా పరమేశ్వరుఁడు హిందువుల పక్షమున లేకపోయిన కారణముచేతఁ బ్రతాపరుద్రుని వీరయోధులోడిపోయిరిగాని తేజోవిహీనముచేతఁగాదుగదా" యని తలంచి యూఱడిల్లి యోరుగల్లు సందర్శించి తరువాత హనుమకొండకుం బోయి పద్మాక్షి దేవాలయమును బూర్వకాలమున బౌద్ధులకు నివాసములైనకొండగుహలను సందర్శించి సంతృప్తుఁడై సాయంకాలమున నోరుగల్లు జేరి మరునాఁడు పయనము జేయఁ దలంచెను.

---

## అయిదవ ప్రకరణము

బసకు రాఁగానే రామరాజు తలపాగ యంగరకా మొదలగు దుస్తులఁదీసివేసి వేఁడినీరు స్నానముచేసి ప్రత్యేక

ముగా నొకగదిలో భోజనమునకుఁ గూర్చుండెను. భాగ్యవం తులు తనయింటికి భోజనమునకు వచ్చినప్పుడు సోదెమ్మ వారి కిష్టములగు పదార్థములను స్వయముగాఁ జేయించి పెట్టుచుం డును. వారును సాధారణముగ నందఱిచ్చునట్టి సొమ్ముకంటె సోదెమ్మకు నెక్కువసొమ్ము చేతిలోఁ బెట్టుచుందురు రామ రాజు వచ్చినదినముననె సోదెమ్మ వానికి మిక్కిలినిష్టములగు పదార్థము లేవియో యడిగి తెలిసికొని యావస్తువులను మిక్కిలి రుచ్యములుగఁ జేయించెను. అప్పటికి రెండుమూడు సంవత్సర ములనుండి సోదెమ్మయొక్క వ్యాపారము లాభకారిగనుండుటచే దాను స్వయముగవంట జేయుటమాని యిద్దఱువంటలక్కలను బెట్టి వారిచే నంటలు వడ్డనలు పైపనులు జేయించుచుఁ దాను వారిసమీపమునఁ బీటవేసికొని కూర్చుండి యేవస్తు వెట్లు చేయవలయునో నియమించుచు నింటికి వచ్చినవారి నెట్లు గౌరవింపవలయునో యట్లు గౌరవించుచు భోజనము చేసినవారీయవలసిన పైకము స్వయముగ వసూలుచేసి కొనుచు సుఖయించుచుండెను. నాఁటిరాత్రి యామె రామ రాజు నిమిత్తము మల్లిపాయలపులుసు గోఁగుకూరపచ్చడి మీఁ గడతోనున్న బత్తెపెరుగు రెండు వేఁపుడుకూరలు వడియము లప్పడములు సిద్ధము చేయించి బ్రాహ్మణులు భోజనము చేయు పడమటింటికి ప్రక్కగదిలోఁ జేరఁబడుట కొకపీట కూర్చుండుట కొకపీట వేయించి కంచుచెంబుతోఁ బంచ పాత్రతో మంచినీళ్ళు పెట్టించి తలదువ్వుకొని జాఱుముడి వేసికొని మెడలో కంటెపట్టెడ బెట్టుకొని పెట్టెలోనున్న

మురిడీగొలుసులు నుంగరములు బెట్టుకొని సన్నని జాబరా రంగుపంచ గట్టుకొని తాను దగ్గఱనుండి స్వయముగ వడ్డన జేయించి వెన్నగాచి ఘుమఘుమలాడుచున్న నెయ్యి తీసికొని వడ్డించెను. రామరాజు భోజనమునకుఁ గూర్చుండి పదార్థములు మిక్కిలి రుచ్యములుగ నున్నవని సంతోషించుచు సోదెమ్మ పడినశ్రమ కామెను మెచ్చుచు భుజింపఁ జొచ్చెను ఆయన భోజనము సేయుచున్నంతసేపు సోదెమ్మ యాగదిలోనె నిలువంబడి కావలసినప్పుడెల్ల నెయ్యి వడ్డించుచు నేదేని ప్రసంగములోనికి దింపఁ దలఁచి యిట్లనియెను. "రామరాజుగారూ! పదార్థములెట్లున్నవో నాకుఁ దెలియదు ఏలాగో యొకలాగు కష్టపడి భోజనము చేయుడు ఎట్లయిన మీ స్వగృహమునలె నుండదుకదా" అనవుడు రామరాజు "సరిలెండి కూరలు పచ్చళ్ళు బ్రాహ్మణులు చేసికొనినట్లు మే మెప్పుడును జేసికొన లేదు. మా బాబయ్యగారికిగాని నాకుఁగాని మంచిపచ్చళ్ళు గాయకూరలు దినవలెనని బుద్ధి పుట్టినపుడు మా వంటమనుష్యులచేత గాకపోవుటచేత మా పురోహితులు సామవేదము సంగయ్యగారి యింటిలో జేయించి తెప్పించుకొందుము. మీరు చేయించిన పదార్థము లెంతో రుచ్యములుగ నున్నవి. ఈ గోగుకూర యెక్కడిదోకాని దీనిని వదలిపెట్టవలెననిలే" దని బదులుచెప్పెను అంత సోదెమ్మ యిట్లనియె "తమవంటిప్రభువులు దయచేయుదురని యెప్పటి కప్పు డప్పడములు వడియములు బెట్టించి గుంటూరులోనుంచి బెజవాడలోనుంచి గోగు

కూర దెప్పించి పచ్చడి పెట్టించి పెండ్లివారియిల్లులా గుంచుదును. మీదయవల్ల రెండావులు రెండుగేదెలు కుంభవృష్టిగ బాలిచ్చుచున్నవి. అందఱకు నేను దలలో నాలుకలాగ మసలుచుందును. గనుక నొకరు పదికావిళ్ళు గడ్డిపంపించి మఱియొకరు చొప్ప పంపించి సాయము చేయుచుందురు. మీయనుగ్రహామువల్ల నే నీసీచవృత్తి చేసినను నలుగురిలో ఫలాన సోదెమ్మంటే యప్రతిష్టలేకుండ నొకరికంటె నెక్కువగా బ్రతుకుచున్నాను. ఈసంవత్సరము రామేశ్వరము వెళ్ళవలెనని యున్నదండీ మీవంటివారు నలుగురు సాయము చేసిన వెళ్ళవలెనని యున్నది'' అనవుడు రామరా జిట్లనియె. ''మీరు సకలసదుపాయములు జేయుదురనియేకదా యూరుగల్లులో నెన్నో పూటకూళ్ళ యిళ్ళుండగా మీయింటికి వచ్చినది? మీ పేరు గోలుకొండలో గూడ ప్రసిద్ధికెక్కినది.''

సోదెమ్మ—అయితే మీది గోలుకొండా కాపురము?

రామ—అవును గోలుకొండే.

సోదెమ్మ—తమ బాబయ్యగారిపే రెవరండి?

రామ—కల్దిండి నరసింహరాజుగారు.

సోదెమ్మ—(ఆశ్చర్య మభినయించి) నరసింహరాజుగారి కుమారులా? మీరు! బాబయ్యగారిపేరు దేశమంతట మోసిపోయినదే. అయితే మీరిప్పు డెక్కడికి వెళ్ళదలచుకొన్నారు?

రామ—నేనా-కొండపల్లె వెళ్ళదలచుకొన్నాను.

సోదెమ్మ—చుట్టాలున్నారా యేమిటండి?

రామ—అవునండి. మా మేనమామగా రున్నారు. వారికక్కడ జబ్బుగానున్నది. మాయమ్మగారు విచారగ్రస్తురాలై వీలుగానున్న పక్షమున మా మేనమామగారిని గోలకొండ తీసికొనిరమ్మని లేనిచో నెమ్మదిగా నుండువఱకు నన్నక్కడ నుండుమని చెప్పినందున నేను వెళ్ళుచున్నాను.

సోదెమ్మ—మంచిపని నాయనా! అమ్మగారికి పేగు సంబంధము గనుక ప్రేమచేత బంపినారు నాతోడబుట్టినవాళ్ళున్నారు. ఎందుకు? చచ్చితినో బ్రతికితినో చూడరు. కాని మీరు మిక్కిలి జాగ్రత్తగా వెళ్ళవలెను. కానిరోజులు వచ్చి కూర్చున్నవి. దారి మంచిదికాదు ఎవరైన బదిమంది సాయమున్నప్పుడు వెళ్ళుట మంచిది.

రామ—భయములేదు. దొరకినపక్షమున బదిమందితో గలిసియే వెళ్ళుదును. లేనిపక్షమున నేనును వెంకటస్వామియు వెళ్ళగలము. నేనును వెంకటస్వామియు నీరెండు దినముల భోజనమునిమిత్తము నెంత యియ్యవలయునో చెప్పండి యిప్పుడే యిచ్చివేసెదను తెల్లవాఱుజామున వెళ్ళవలెను.

సోదెమ్మ తొందర యేమండి తెల్లవాఱుజామున నే వెళ్ళవచ్చును. నేను లేకుండ దీపము వెలిగించి మిమ్ము సాగనంపకుండ వెళ్ళుదురా? మీకంటె ముందుగా లేచి నేనే మిమ్ము లేపెదను సొమ్ము విషయములో మీచిత్తము వచ్చినంత యియ్యవలసినదే కాని యింత యియ్యవలసినదని మీవంటివారి నడుగను మీరు తిరిగి వచ్చునప్పుడు మాయింటికే రావలెను.

ఇట్లు మాటలాడుచునప్పటికి భోజనము ముగిసెను. అనంతరము రామరాజు సోదెమ్మ వినయమునకు సంతసించి యొక వరహా తీసి సోదెమ్మ కిచ్చెను. సోదెమ్మ సంతోషించిన ట్లామె మొక మే తెలియఁజేసెను. పిమ్మట రామరాజు తన నిమిత్తమై వెంకటస్వామి వేసినపరుపుమీఁద బండుకొనియెను. అవ్వల వెంకటస్వామి భుజియించి సామాను సర్ది తెల్లవాఱుజామున లేపుమని సోదెమ్మను గోరి పండుకొనియెను.

---

## ఆ ఱ వ ప్ర క ర ణ ము

---

తరువాత సోదెమ్మ లోపలకు వెళ్ళి భోజనము చేసి నారాయణా యని యొక మనుష్యుని బిలిచెను. ఆతఁ డెంతకుఁ బలుకకపోవుటచే మూఁడునాలుగు సారులు పిలిచి వీఁడెక్కడో నిద్రపోవుచున్నాఁడు కాఁబోలునని దీపము పుచ్చుకొని నాలుగు మూలల వెదకి వంటయింటి దొడ్డివసారాలో వట్టినేలఁ బండు కొని నిద్రపోవుచున్న నారాయణునిఁ జూచి కొట్టిలేపెను. వాఁడు కన్నులు నులుముకొనుచు లేచి "యెందుకండీ! అబ్బా నిద్రవచ్చుచున్నది. ఎందుకు లేపుచున్నా"రని విసుగుకొను చుండ సోదెమ్మ "తెలివితక్కువ నిర్భాగ్యుఁడా! త్వరగా నిద్రపోవద్దని నేనిందాక చెప్పలేదా! పనియున్న దినముననే నీకుఁ బెండలకడ నిద్రవచ్చును. ఓయంటె పెద్దమ్మ పలుకు

చుండును. నీనెత్తిమీద నిద్రాదేవత తాండవమాడుచుండు" నని సాదింపు మొదలుపెట్టెను. "సాదింపక పని యేమిటో చెప్పుదురూ" అని నారాయణుఁడు చక్కగా మెలఁకువ దెచ్చుకొని బదులుచెప్పెను, 'వానినొక్కమాటు తీసికొనిరా' యని సోదెమ్మ పలికెను. ఎవరిని? జోగులునా యని నారాయణుఁడు మరల బదులుచెప్పక వెంటనే యంగవస్త్రము భుజమున వేసికొని విడిపోయినజుట్టు ముడివైన వేసుకొనక బయలుదేఱి వెళ్ళి యొక గడియలో నల్లగాఁ బొడువుగా బక్కపలుచగా నున్న యొక మనుష్యుని వెంటఁ బెట్టుకొని వచ్చెను. ఆతని జూచి సోదెమ్మ యిట్లనియెను. "ఊరిలో నున్నావా? కనబడుట లేదేమి? తొందర లేమియు లేవు గదా! కూర్చుండుము నారాయణా! నీవు తలుపు వేసి చావడిలోఁ బండుకొనుము" నారాయణుఁడు వెంటనే వెళ్ళిపోయెను. జోగులు వంటయింటి దొడ్డి యరుగుమీదఁ గూర్చుండెను. వాని కించుక యెడముగా సోదెమ్మ కూర్చుండెను. అప్పుడు వా రీవిధముగా మాటలాడిరి.

జోగు—కబు రెందుకు పంపినారు? ఏమైన విశేష మున్నదా?

సోదెమ్మ—విశేషముండబట్టియే పంపినాను. లేనప్పుడు పంపుదునా?

జోగు—అయితే వెందలకడ చెప్పండి.

సోదె—కల్దిండి నరసింహరాజుగారి నెఱుఁగుదువా? గోలకొండలో సరదారు.

జోగు—విన్నాను. ఆయన చాలగొప్పవాఁడు. తెనుగు వారిలో గోలకొండలో నంతవాఁడు లేడు.

సోదె—అయితే మీకాయన పేరు తెలియునా?

జోగు—ఆహా తెలియకేమి? ఆయనకంట మేము పడ లేదు. మాకంట నాయన పడలేదు.

సోదె—ఆయన కంటఁబడితే నీపనిసున్న.

జోగు—అంతవఱకు రాకుండ మాపని మేము చేసి కొనుచున్నాము. ఇప్పుడు సంగతి యేమో చెప్పవన్నా?

సోదె—ఆయనకొడుకు కొండపల్లె వెళ్ళుచున్నాడు.

జోగు—వెంట నెందఱున్నారు?

సోదె—వెంకటస్వామి యను నొక కాఁపు కుఱ్ఱవాఁ డున్నాడు.

జోగు—అంతేనా మరియెవరు వెంటలేరూ? పైకము న్నదాదగ్గఱ?

సోదె—చూడలేదుగాని పైక ముండకపోదు. దూర ప్రయాణము చుట్టాలకు జబ్బుగానున్నదని వెళ్ళుచున్నాడు, పైకములేకుండ వెళ్ళఁడు.

జోగు—పైకము లేకపోయినను సరే భయములేదు.

సోదె—ఇందుకే వర్తమానమంపించినాను. వారు తెల్లవాఱుజామున బయలుదేఱి వెళ్ళుదురు.

జోగు—సరే! ఈపర్యాయము వలలోఁ బెద్దచేఁప

పడవచ్చును. నీయదృష్టము పుచ్చినది. నేనింక వెళ్ళిపోయెదను తెల్లవాఱుజామున ప్రయాణము నిశ్చయమేనా?

సోదె—నిశ్చయమే. సందేహము లేదు. ఇఁక నీవు వెళ్ళు నామీఁద దయయుంచవలసినదని మీదొరతోఁ జెప్పు.

అని పలికి సోదెమ్మ వెళ్ళుట కుద్యుక్తుఁడై లేచిన జోగులును దొడ్డిదారినిం బంపి తలుపువైచి లోపలికివెళ్లి వంట కత్తియలనిద్దఱను "పనికాలేదా? ఈపాటికిపండుకొనుడు. తరు వాయి పని ప్రొద్దున చేసికొనవచ్చు" నని చెప్పి గదిలోనికి వెళ్ళి పందిరిపట్టెమంచముమీఁదఁ బండుకొనియెను. అందఱు గాఢనిద్ర జెందిరి. కొండగంగులు తన కిరువది మొహరీలను దెచ్చి బహుమానమిచ్చినట్లు సోదెమ్మ కలగని కలలోఁ దన కృతజ్ఞ తను దనసంతోషమును దెలియఁబఱచుచుఁ బలవరించెను. తెల్లవాఱుజామున కోడి కూయఁగానె సోదెమ్మకు మెలకువ రాగా నామె లేచి దీపము పట్టుకొని వెంకటస్వామిని లేపెను. అతఁడు తొట్రుపడి లేచి మెల్లగాయజమానివద్దకు వెళ్ళి "అయ్య గారూ అయ్యగారూ" అని నాలుగైదు సారులు పిలిచి లేపి తాను దీపముబట్టుకొని గుఱ్ఱమువద్దకు వెళ్ళి దానికి జీను వేసెను, రామరాజు లేచి కనులుదుడిచికొని దుస్తులు వేసికొని యొరలో నున్నకత్తి మొలలో వేసికొని సోదెమ్మవద్ద సెలవు పుచ్చుకొని గుఱ్ఱమెక్కెను. వెంకటస్వామి యజమానుని దుస్తులు సామా నులుగల తోలుమూసిన బోనముపెట్టె నెత్తిమీఁదఁ బెట్టుకొని గుఱ్ఱము వెంట బయలుదేఱెను. సోదెమ్మ వీధిగుమ్మముదాక

సాగనంపి తలుపు వేసికొని లోనికిఁబోయి నిద్రించెను. రామరాజు సేవకసమేతుఁడై నాలుగైదు సందులుదాఁటి రాజవీధింబడి తనవలెనే ప్రయాణములనిమిత్తమై పెందలకడ మేలుకాంచి మూటలు సర్దుకొనుచున్న బాటసారులను—మాటలు చెప్పుకొనుచు నడచుచున్న బాటసారులను—నిద్దురబద్ధకంబుచే లేవలేకయున్న చుట్టాలను జేతులతోఁ గొట్టి బిగ్గరగాఁ బిలిచి లేపుచున్న బాటసారులను—నీవస్తువు కనఁబడలేదా నావస్తువు కనబడలేదని వెదకికొనుచున్న బాటసారులను—నరఁగులమీఁద జెల్లక్రిందఁ గాంచుచు నావీధి దాఁటెను. దాఁటి యూరు వెలుపలనున్న మేదరవాండ్ల యిండ్లు గడచి బెజవాడ బోవుబాట చేరునప్పటికి గుఱ్ఱములపై నెక్కి పదిమంది మనుష్యులు రామరాజును గలిసికొనిరి. "మీరెవ్వ రేయూరువెళ్ళువా" రని రామరాజు వారి నడుగ నందులో నొక డిట్లనియెను. "మేము వర్తకులము. ఏలూరునుండి తివాసులు తెచ్చి యోరుగల్లులోను గోలకొండలోను గుల్బర్గాలోను విక్రయించుచుందుము. ఈవఱకు దెచ్చినసరకై పోయినది మరలసరకుఁ దెచ్చుటకై వెళ్ళుచున్నాము. మీ రెందాకపోయెదరు ?" మేమిద్దఱము కొండపల్లె వెళ్ళఁదలచుకొన్నా" మని రామరా జుత్తరము చెప్పి మీ రేవర్ణమువారని వారి నడిగెను. "మేము కాపులము. ఓరుగల్లుకాపుర" మని వారు బదులుచెప్పి మీ రెవ్వరని రామరాజు నడిగిరి. రామరాజు తనపేరు తండ్రిపేరుచెప్పి తానరుగుచున్న పనిగూడవారికిఁ దెలియఁజేసెను. అదివిని

వారు సంతసించి యట్లయిన మన మందరము జట్టుగాఁ బ్రయాణము సేయవచ్చును. కొండపల్లెలో మిమ్ము దిగబెట్టి నే మేలూరు వెళ్ళుదుము. మీవంటి క్షత్రియ కుమారుఁడు సాయమున్నపక్షమున మావంటివర్తకుల కేభయము నుండదు. త్రోవలో దొంగలభయము మిక్కుటమని మా గుండెలు పీచుపీచుమనుచున్నవి. మీవంటివారు ముందుండిన పక్షమున మీ వెనుకఁ జేరి యెంతపనినైనఁ జేయఁగలము'' అని యాతనికి ధైర్యముచెప్పి తాము ధైర్యము దెచ్చుకొని నడువ సాగిరి.

---

## ఏడవ ప్రకరణము

ఓరుగల్లు విడిచి రామరాజు పదుగురువర్తకులం గలిసి యానాఁటిరాచబాటం బడి పయనము సేయుచుండఁ బూర్వ చారిత్రముఁ యందభిరుచిగలవాఁ డగుటచే నాతని మనంబున నెన్నోతలంపు లుదయించెను. ఏచెట్టుకనఁబడినను వానికి గణపతిదేవుఁడు రుద్రమదేవి ప్రతాపరుద్రుఁడు మొదలగునోరుగంటిసామ్రాజ్య దురంధరుల పేరులుజ్ఞప్తికివచ్చెను. ఏవంకఁ జూచిన వారి ప్రతాపమే స్మరణకువచ్చెను. వెంటనున్న పదుగురువర్తకులు, 'దమలోఁ దామేదో యిష్టాగోష్ఠిఁ జెప్పుకొని కాలక్షేపముఁ జేయుచుండ రామరాజునిశ్శబ్దముగ గుఱ్ఱమును

నడపించుచు, దీర్ఘాలోచనము సేయుచున్న వానివలె, గనఁబడెను. కొంతసేపటికిఁ దెల్లవాఱెను. అప్పటికి వారొక కుగ్రామముఁ జేరిరి. అక్కడవారందఱు గాలకృత్యములం దీర్చికొని సూర్యోదయ మగునప్పటి కంద ఱొకచోటఁజేరి మరల పయన మారంభించిరి. రామరాజు మనస్సు పూర్వకథను స్మరించుకొనుచు నన్యచింత లేకయుండెను. తోడనున్నవర్తకులు నడుమనడుమ నాతనిం బలుకరించి యేవో కొన్నిప్రశ్నలడుగుచుండిరి. కాని వాటిలోఁ గొన్నిఁటి కుత్తరమిచ్చి కొన్నిఁటి కుత్తరమీయక పోవుచుండెను. ఆవర్తకులలో మొనగాఁడగు నాతఁడు రామరాజు గుఱ్ఱమువద్దకుఁ దనగుఱ్ఱమును దోలి "రాజా! మీరు పరధ్యానముగ నున్నట్లు కనఁబడుచున్నారేమి?" యనియడిగెను. "అయ్యా! నీపేరెవరో నే నెఱుఁగను. కాని నామనసులోనున్న సంగతి మీతో జెప్పెద" నని యుత్తరమిచ్చెను. "నాపేరు జగన్నాధదాసు. మీామనసులో నున్నది నాతోఁ జెప్పవచ్చు" నని యావర్తకుఁడు బదులు చెప్పెను. అంతట రామరా జిట్లనియె.

"జగన్నాధదాసుగారూ! ఓరుగల్లుపురముఁ జూచి నప్పటినుండియు నామనసు మనసులో లేదు. ఆ పట్టణము యొక్క ప్రాచీనవైభవమునుగూర్చి పెద్దలవలన నేను విని యుండుటయేకాని కన్నులార నెన్నఁడుఁ జూచియుండలేదు. ఈపట్టణముయొక్క నాఁటి మహావైభవము నేటి దీనదశయు దలపోయ నామనంబు విషాదభరితమైయున్నది. ఎంతవైభవ

మనుభవించిన నగరము! నగరముమాట యెందుకు? ఈ మార్గముటెల్ల గణపతిదేవునియొక్కయుఁ బ్రతాపరుద్రదేవుని యొక్కయు మహాసైన్యములు త్రొక్కివిడిచినవియెకదా. ఈ బాటప్రక్కనున్న వృక్షములలోఁ గొన్ని ప్రతాపరుద్రదేవుని యొక్క దండయాత్రలను స్వయముగజూచినవి ఈచెట్లనున్న యాకు లన్నియు వాటికి నాలుకలైనపక్షమున నానాలుకకు మనుష్యుల నాలుకలకుంబోలె మాటలాడుశక్తి భగవంతుడు ప్రసాదించిన పక్షమునఁ గాకతీయ సామ్రాజ్యవైభవమును జరిత్రకారులకంటె, రెండువేలనాలుకలున్నయాదిశేషునికంటె నెక్కుడు రసవంతముగ నెక్కుడు చమత్కారముగ వర్ణింపకుండునా? ఇక్కడనున్న వృక్షములలో ననేకము లోరుగంటి సైనికులకు ప్రయాణముచేత నలసిసొలసినకాలమునయుద్ధమున గాయములుపడ్డ సమయమున జల్లనినీడనిచ్చి మనిచియుండును. శత్రుమనోభయంకరములైన కాకతీయరాజరణదుందుభులీప్రాంతములెల్ల మారుమ్రోయునట్లు పలుమారు భాంకరణములం జేసియుండెను. మెడలో ఘుణిల్లుఘుణిల్లుమని మ్రోయు కల్యాణఘంటలు వెడదవెన్నులమీద బంగారు పూఁతపూసిన వహాదాలు శరీరమునిండ నానావిధచిత్రాలంకారములు మందమంద గమనంబులు గలిగి కాకతీయ సామ్రాజ్యలక్ష్మి వేలకొలఁది మహోన్నత రూపములు ధరియించి విహారములు సేయుచున్నదోయని చూచువా రద్భుతానంద రసమగ్నులై కొనియాడుచుండ నీమార్గంబున బ్రతాపరుద్రదేవుని యేనుం

గులు వేనవేలు నడగొండలవలె నడచి తనఘీంకారంబులచేత నీప్రాంతారణ్యముల నెల్లఁ బ్రతిధ్వనులిచ్చునట్లుచేసి భూమిని మోయుచున్న యాదిశేషునియొక్కయు దిగ్గజములయొక్కయుఁ దలలు క్రుంగునట్లు చేసియుండును. అట్టి యీమార్గము లన్నియు నేఁడు మహమ్మదీయ సైనికుల ధాటికి లోఁబడి యున్నవి. ఓరుగల్లుపురము మహమ్మదీయుల స్వాధీనమైనది. పరమపావనులు వేదాధ్యయనపరులునగు బ్రాహ్మణోత్తముల పూజలచే వెలసి భక్తకోటికి నయనానందకరములై కలియుగ వైకుంఠములై యుండిన శివవిష్ణుదేవాలయము లోరుగల్లులో నేఁటికాలమున మసీదులై హిందువులు చొరరానివై నమాజు లతో మాఱుమ్రోగుచున్నవి గదా! ఆహా! కాలమహిమ యేమి? ప్రతాపరుద్రుడు కొలువు దీర్చిన హజారములలో మహమ్మదీయ సుబేదారులు దర్బారులు తీర్చుచున్నారు. ఇది నాకెంతకష్టముగ నున్నది నాతండ్రి తురకప్రభువులవద్ద నుద్యోగియై పేరుపొంది బిరుదులు ద్రవ్యము సంపాదించి తానాషా కాంతరంగిక మిత్రులలో నొకడయినను నాతని గుణంబులు సద్గుణంబులైనను నాతనిమీఁద నాకెంతో యనురాగ ముండినను నేనాంధ్రజాతిలో జన్మించుటచేతను నందు క్షత్రియకుటుంబమునందుఁ బ్రభవించుటచేతను నందు లో ననేక వీరపురుషులకు జన్మస్థానమైన కలిదిండివారి వంశ మున జన్మించుటచేతను నందులో మేటిమొనగాడని పేరు వడిన నరసింహరాజు గర్భమున జన్మించుటచేతను నాచంద్ర తారార్కముగ స్థిరమైయుండవలసిన యాంధ్రమహాసామ్రా

జ్యమునకు నీవిధముగ నూరుపేరు లేక చెడిపోవలసిన దుర్యో
గము పట్టెగదాయని నామనం బెంతయుం జింతించుచున్నది.
ఇది దేశాభిమానముగాని రాజద్రోహము గాదు. బంధువియో
గముకంటె మిత్రయోగముకంటె నాకీ యాంధ్రసామ్రాజ్య
నాశన మెక్కువదుఃఖము గలిగించుచున్నది. ఇందువలన
నారాజునెడ నాకు భక్తిలేదని నీవనుకొనవలదు. సమయము
వచ్చినదేని నేను నాతండ్రియు నాపరివారములు రాణాప్రా
ప్రక్కను నిలిచి యాతని విజయమే కోరుచుఁ గాలు భూమి
మీఁద నిలువఁబడినంతసేపు కత్తిబట్టుకొనుటకుఁ జేతిలోశక్తి
యున్నంతవఱకు బొందిలో ప్రాణము లున్నంతవఱకు నాతని
ధ్వజ మప్రతిహతముగ విజృంభించుటకుఁ బోరాడుదము. ఈ
విధమైన రాజభక్తి నామనసులోనున్నను నాకును నా పితృ
పితామహులకును నాజాతికి జన్మభూమియైన యాంధ్రదేశము
మీఁది మహాభిమానము నామనంబున మితిమీరియున్నది.
అందుచేత నాకీ విషాదము జనించుచున్నది.''

అని రామరాజు తన మనంబులోనున్న విషాదము
దెలియఁజేయునప్పటికి వా రొకయూరు జేరిరి. పయనము
చాలించి యక్కడపడియుటకై వారు గుఱ్ఱములదిగి యొక
సత్రముకడకుఁబోయిరి. వర్తకులు వేరుగ వంటజేసికొనిరి.
వెంకటస్వామి గుఱ్ఱమునకు మేఁతవేసి యజమానునకు వంట
జేసి పెట్టి తాను భుజించెను. భోజనానంతర మందఱుఁ గొం
తసేపు విశ్రమించిరి.

---

# ఎనిమిదవ ప్రకరణము



మన బాటసారు లాదినమున జాముప్రొద్దు వేళ మరల ప్రయాణ మారంభించిరి. ఉబుసుపోవుటకై జగన్నాథదాసు రామరాజును నానావిధములగు ప్రశ్నలడుగఁ జొచ్చెను. రామరాజు నాటి యుదయమున నున్నంత పరాయత్తచిత్తుడై యుండకపోయినను మొత్తముమీఁద కాకతీయసామ్రాజ్య ప్రాచీన మహోన్నతదశను తన కాలమునాటి దుర్దశతోఁ బోల్చుకొని చింతించు నభిలాష యాతని మనసున విడువ లేదు. జగన్నాథదాసు దేశాభిమానము మొదలయిన వెట్టిపో యెన్నఁ డెఱుంగక పోయినను విచిత్రకథలు పూర్వరాజుల వృత్తాంతములు మొదలయినవి వినుటయం దత్యంతాసక్తి గలవాఁడు కథ వినుట యనఁ జెవి కోసికొనును. కథ చెప్పెడు వా రున్నపక్షమున నతఁ డన్నము నీరు నక్కఱ లేకయే వినుచుండును. అందుచేత నతఁ డా సాయంకాలమునఁ బయనము సేయునపుడు రామరాజుతోఁ నిట్లనియెను.

"రాజా! ఓరుగంటిరాజుల ప్రతాపమును గురించి నీవు మిక్కిలి పొగడుచుందువు. వట్టిపొగడ్తలతోఁ గాలక్షేపము సేయక యేదేని రెండుమూడు కథలు చెప్పి మమ్ము సంతోషపెట్టగలవా? చదువుకొన్న నీవంటివారు కథలు చెప్పఁ దొడంగిన పక్షమున నవి యెంతో రసవంతముగ నుండును. ఇదివఱకెన్నో సారులు నేను కాశీమజిలీలు భేతాళ కథలు

హంసవింశతికథలు వినియున్నాను. కల్పనాకథలుగాక నిజముగా జరిగిన వృత్తాంతములు వినవలయునని నాకెంతో కుతూహలము గలదు. వినిన నీవంటివానివలననె వినవలయును.'' అనవుడు రామరాజు చదువెఱుఁగని వారికైన దేశచారిత్రములు వినవలయునను కుతూహల మప్పుడప్పుడు పుట్టుచుండును గాఁబోలునని తనలోఁ దాననుకొని చిఱునవ్వు నవ్వి జగన్నాథదాసు కిట్లనియె.

''నీకంత వినఁ గుతూహలముగ నున్నపక్షమున నేను పుస్తకములలోఁ జదువుకొన్నవి పెద్దలవలన వినినవి కొన్ని కథలు చెప్పఁగలను. కాని యిప్పుడు చెప్పలేను. సాయంకాలము ముందు గ్రామమునకుఁ జని ప్రయాణము చాలించిన తరువాత భోజనాదికృత్యములు ముగిసినవెనుక నేను జెప్పఁదలచుకొన్న కథలు చెప్పెదను. ప్రయాణము చేయునప్పుడట్టివి చెప్పుట కోపికయుండదు. తిన్నగా వినుటకు మీకును మనసుండదు. మనసు లన్యథాయత్తములు కానప్పుడె కథాశ్రవణమువలనఁ గలుగు సంతోష మఖండమైయుండును.''

అనుచుండ జగన్నాథదాసు వానిమాట కడ్డమువచ్చి పయనముచేసిచేసి యుండుటచేత భోజనము చేయగానె మీరు నిద్రకు పడుదురేమో యనుభయ మగుచున్న దనెను. ''నాకు నిద్రరాదు. కాకతీయరాజుల వృత్తాంతములు నిద్రాదేవతను దరికి రానీయనట్టి మహామంత్రములు. నీకు నిద్ర రాకుండఁ జూచికొ''యని రామరాజు బదులుచెప్పెను. ''ఎంతనిస్సార

మైన కథ విన్నను నాకు నిద్రరాదు. అటులుండ మీవంటి వారు చెప్పుచుండ కాకతీయుల కథ వినుచుండిన నిద్రవచ్చునా? కావున నట్టి భయములే'' దని జగన్నాథదాసు పలికెను. ''సరే యట్లయిన ముందుగ్రామము చేరనీ''యని రామరాజు వెండియుఁ బ్రత్యుత్తరమిచ్చి గుఱ్ఱము నొకింత తఱటుచేసి వడివడి నడిపించెను. జగన్నాథదాసును దక్కిన వర్తకులును గూడ గుఱ్ఱపురౌతు లెంతవేగముగ మార్గములఁ గడచు చుండిరో కాలినడకనున్న వెంకటస్వామియు నెత్తిమీఁద బోనముపెట్టె బెట్టుకొని యంతవేగముగానే పయనము సేయు చుండెను. జగన్నాథదాసు మొదలగువారు వెంకటస్వామి యొక్క గమన చాకచక్యమును విలోకించి వాని కాళ్ళలో నున్న వెముకలుగాక యినుపతునకలేమోయని పలుమారు పయనములో బలుకుచు వచ్చిరి.

అట్లు కొంతసేపునడచునప్పటికి సాయంకాలమయ్యెను. ఉదయమునుండి ప్రయాణముచేసిన మార్గస్థుల మొగముల వలె సూర్యబింబముగూడ నెఱ్ఱనై తనకు విశ్రాంతి నొసంగు స్థానముచేరు సమయ మెప్పుడువచ్చునో యని యపరదిక్కున కరుగుచుండెను. మనబాటసారుల యాయాసమువలెనేబయలు దేరునపుడు స్వల్పములై చిట్టచివర కతిదీర్ఘములయ్యెను. క్రమ క్రమంబున భానుబింబ మపరదిక్కునఁ గ్రుంగిపోయెను. చీఁక టులు నలుదెసలఁ గమ్మెను. చీఁకటి పడినతరువాత వారొక గ్రామముఁ జేరిరి. ఆగ్రామమున సత్రములేదు. కాని యొక

గృహస్థుఁడు వారికందఱకు బసయిచ్చి యాదరించెను. ఆగృహస్థుఁడు మిక్కిలి ధనవంతుఁడగుటచేతను ధర్మబుద్ధి గలవాఁడగుటచేతను వీరికందఱకు భోజనాదిసత్క్రియలు చేయించి యాదరించెను. భోజనమైన తరువాత జగన్నాథదాసు కథాప్రారంభము సేయవలసినదని రామరాజును గోరెను. గృహయజమానుఁడు తనయింటనున్న యతిథులలో కలిదిండి నరసింహరాజు కుమారుఁడు రామరాజున్నాఁడని విని యాతని పరిచయము జేసికొని ప్రియభాషణంబులు సత్కారంబులు సలిపి యెంతో గారవించి కథను వినగోరి కూర్చుండెను. ఆయింటి చుట్టుప్రక్కలనున్నవారు నలుగురుముగ్గురు గూడ వచ్చి రామరాజు దర్శనముఁజేసి కథను వినుటకై కూర్చుండిరి. అప్పుడు రామరాజు క్రింది విధమున కథఁ జెప్పెను.

---

## తొమ్మిదవ ప్రకరణము

### గణపతిదేవుని కథ

ఓరుగల్లు పట్టణమునఁ బూర్వకాలమునఁ బ్రసిద్ధికెక్కిన కాకతియను దేవత కలదు ఈదేవత నారాధించుటంబట్టి యోరుగల్లు నేలిన రాజులవంశము కాకతీయవంశమని చరిత్రమందుఁ బేరువడసెను. కాకతీయప్రభువులలో నెల్ల గణపతిదేవుడుప్రతాపరుద్రదేవుడు నను నిరువురు పురుషులును రుద్రమదేవియను

స్త్రీయు నత్యంత ప్రతిష్ఠగలిగి యాంధ్రదేశమునకుఁ నాంధ్ర దేశమునకుఁ గాదు—దక్షిణహిందూస్థానమునకు నెంతయు వన్నెదెచ్చిరి. మనదేశమునకె కాదు గణపతిదేవప్రతాప రుద్రులవంటి మహారాజులును రుద్రమదేవివంటి రాణియు నేదేశమునకైన నేకాలమునకైన నలంకారభూతులై యుం దురనుటకు నిస్సంశయము ఆ మహాత్ములం దలఁచి యాంధ్ర దేశస్థులందఱు నేఁటికాలమునను భవిష్యత్కాలమునను మాదేశ మిట్టి రాజరత్నములం గనిన గనియని గర్వించి యుండవచ్చు. ఆంధ్రదేశచరిత్ర మనియెడు మహాకాశము నందు వీరి మువ్వురి నామధేయములు తేజోవంతములగు జ్యోతులై రాజరాజ నరేంద్రసాళువనరసింహరాజ కృష్ణ దేవరాయ రామరాయ ప్రముఖరాజచంద్రుల సరసను వెల యుచుండును. ఆమువ్వురిలోఁ బ్రథముఁడగు గణపతిదేవుని గూర్చిన యొక కథ చెప్పెద. అయ్యది చెప్పువారికి వినువా రికిఁ గూడ మహానందకరముగ నుండును. ఈ మహారాజుం గూర్చియు నంత విశేషముగ మనకుఁ దెలియదుగాని తెలిసి నంతవఱ కాతఁడు ప్రజానురంజనమునకై పాటుపడిన యుత్త మప్రభువని చెప్పవచ్చును. ఈతఁ డోరుగల్లు సామ్రాజ్య మును బరిపాలించుచుండిన కాలమున మనుమసిద్ధి మహారాజు నెల్లూరు పరిపాలించుచుండెను. వ్యాసరచిత మహాభారతము నందలి పదునైదు పర్వంబుల నఖండపాండిత్యము మెఱయ నమృతపు గాలువల భూమండలమున వ్యాపింపఁజేసిన తెఱం గున రసము లొలుక నాంధ్రీకరించి తెలుఁగుభాష పృథివీ

మండలమున నుండినంతకాల మాంధ్రమహాజనుల కృతజ్ఞతకుఁ బాత్రమైన తిక్కనసోమయాజి మహాకవి సార్వభౌముఁడు మనుమసిద్ధి మహారాజునకు మంత్రియై మహాకవియై మిత్రుఁడై యుండెను. మహాకవి యొకఁడు రాజకార్యవేత్తయై ప్రసిద్ధిగాంచుటకు మన తిక్కన సోమయాజి చరిత్రమే ప్రథమోదాహరణమై యుండవచ్చు. కవితావిషయమున మత్తేభరాజులు శార్దూలంబులు నాతని కనువర్తులై యెట్లు చెప్పినచొప్పున నడచెనో యట్లు మంత్రిత్వమునఁ గూడ శత్రురాజ మత్తేభరాజులు పరరాజశార్దూలంబులు నాతనికి వశవర్తులై చెప్పినచొప్పున నడచెను. హాహా! మనుమసిద్ధి మహీపాలుఁ డెంత యదృష్టవంతుఁడు. ఆంధ్రభారతమును భూలోకమున నవతరింపఁజేసిన యపరవ్యాసుఁడనఁదగు నన్నయభట్టారకునిఁ దన యాస్థానకవిం జేసికొని యాతని మృదు మధురభాషణంబులు తన చెవులకు రత్నకుండలముల కంటె నెక్కుడువిలువగల భూషణంబులుగ నాతని చెలిమి కారణమునం జేసి ధన్యతం గాంచిన రాజరాజనరేంద్రుని తెలుంగునను తిక్కన సోమయాజిని జూచుటచేఁ దనకన్నుఁదోయియు నాతనికి నమస్కరించుటచేఁ జేదోయియు రసగర్భితములగు నాతని పలుకుల వినుటచే వీనుదోయియు ధన్యంబు గావించుకొనిన మనుమసిద్ధి మహారాజు నదృష్టమే యదృష్టము. ఆ రాజున కామంత్రి తగు; ఆ మంత్రికా మహారాజు తగు. ఆ రాజు నామంత్రియు నన్నదమ్ములవలె సౌహార్ద్రము గలిగి

తమ యిరువురిమాట వొక్కటిగ బోరయుఁబోచ్చెము లేక దేశమును బాలించుచుండ నెక్కడనుండియో మిడుతలదండు లవంటి సైనికులఁ గూర్చుకొని శత్రురాజులు వారిపై దండు విడిసిరి. జయాపజయంబులు దైవికంబులుగదా! మనుమసిద్ధి పలాయితుఁ డయ్యె. రాజ్యంబు శత్రురాజులచేఁ జిక్కె. తిక్కనసోమయాజికిం గల రాజభక్తి తప్ప తనదని చెప్పఁ దగిన సొత్తు మనుమసిద్ధికి రెండవదిలేదు. రాజ్యలక్ష్మిచేతను సైనికులచేతను జుట్టములచేతను ధైర్యముచేతను విడువఁబడి తనకంటె నాప్తులులేక కుందుచున్న తనశిష్యు నచిరకాల మిత్రుని, స్వామిని, పోషకుని, మనుమసిద్ధిని గాంచి తిక్కయజ్వ "రాజా! భయపడకు. కలిమిలేములు కావడికడవలు వెన్నెలతరువాతఁ జీకటియుఁ జీకటి తరువాత వెన్నెలయు వచ్చిన నైశ్వర్యంబులు కష్టములు పర్యాయమున వచ్చు చుండును. నీసంపద నీకు మరలవచ్చు. నీశత్రువులు పరాజితు లగుదురు. పెన్నదివరదలవలెనే నీశత్రువుల బలము స్వల్ప కాలమునఁ దీసిపోవు. ఆనది తిప్పలు బయలుపడినట్లే నీశత్రువుల తిప్పలు బయలు పడఁగలవు. త్రిలింగ సామ్రాజ్య ధురంధరుఁడగు కాకతీయగణపతిదేవ మహారాజు వద్దకు నేను బోయి నీదీనదశ వానికి విన్నవించి వానిం దోడ్కొనివచ్చి నిన్ను మరల రాజ్య ప్రతిష్ఠితుని జేసెద నాకు సెలవిమ్ము" అని పలికి యాతని వీడ్కొని తనకాప్తు లగు శిష్యులను బరిజనులను గొందఱిని దోడ్కొని శత్రు

రాజుల కంటఁబడకుండ బయనమై యోరుగల్లునకుం బోయెను. ఆతనికంటె ముందే యాతనికీర్తి యోరుగల్లుజేరి గణపతిదేవుని చెవులయెదుట నిలుచుటచే నతఁడుఁ తనమంత్రులను బురోహితులను బిలిచి తిక్కనసోమయాజిని సబహుమానముగ సగౌరవముగ దోడ్కొనిరావలయు నని యానతిచ్చి పంపెను. వారును రాజాజ్ఞ శిరసావహించి సోమయాజిని సవినయముగ దర్శించి సబహుమానంబుగ నోరుగల్లునకు గొనిపోయిరి.

ఆంధ్రకవితారసాభిజ్ఞుడు విద్వజ్జనపోషకుడు నగు గణపతిదేవుఁడు తిక్కనసోమయాజివంటి మహాకవీశ్వరుడు తన దర్శనంబునకు వచ్చుటంజేసి తనదేహము గేహము పావనమైనదని సంతసించి లోకోత్తరచరిత్రుడగు నాకవీంద్రున కనేక బహుమానము లొసంగి యా మహాత్మునిచే రచియింపబడిన మహాభారతమున విరాటపర్వము మొదలుకొని స్వర్గారోహణ పర్వమువరకు గల పదునైదు పర్వంబులనా కవి ముఖంబునను విని బ్రహ్మానందభరితుఁ డయ్యెను. సోమయాజి నోటనుండియే భారత మాకర్ణించిన యాగణపతిదేవుని జన్మమే జన్మముకదా. అనంతరమున సోమయాజి యచ్చట గొన్నిదినంబు లుండి హనుమకొండలో నున్న బౌద్ధపండితులతో నీశ్వరాస్తిక్యమును గూర్చియు వేదనిత్యమును గూర్చియు కర్మప్రయోజనముం గూర్చియు గణపతిదేవుని ప్రేరణంబున వాదముచేసి బౌద్ధుల నోడించి వైదికమార్గచరులకు సకలవర్ణములవారికి ముఖ్యముగా గణపతిదేవునకు మహానందము గల్పించెను. అట్లు కొన్ని

దినంబులు గడిచిన పిదప గణపతిదేవుడు సోమయాజిం జూచి "స్వామీ! నెల్లూరునుండి దేవరవారు మాపురంబునకు విజయము చేయుటకు గారణమేమో తెలియకున్నది. నావలన దేవరవారి కేదేని ప్రయోజన ముండినపక్షమున నేను నా పరిజనంబులు నాసైన్యంబులు చేతుల గట్టుకొని మీపనుపు శిరసావహించి కృతకృత్యుల మయ్యెదము. ధనము కావల యునా ధనాగారము మీయదియె. భూములు కావలయునా రత్నగర్భలగు వసుంధర లున్నవి. కోరిన పంటభూములు నగ్రహారంబులు నిచ్చెద. ఇదిగాక మీకే కోరిక గలదో దానిం దెలియ జేయుదురేని నాశక్తి యున్నంతవఱకు దాని నెఱవేర్చి మీయనుగ్రహంబునకు పాత్రమునయ్యెద" నని పలికెను. అనవుడు తిక్కనసోమయాజి గణపతిదేవున కిట్లనియె. "దేవా! నీయాస్తికబుద్ధికి నీవు నాకు గావించిన మహాగౌరవంబునకు గడుంగడు సంతసించితి. నాకోరుగల్లు నెల్లూరుపురమైనది. గణపతిదేవుడు మనుమసిద్ధియయ్యె రాజా! నాకు ధన మక్కఱలేదు. మనుమసిద్ధి గణపతిదేవులే నాకుధనము. అగ్రహారము లక్కఱలేదు. భూదేవి కగ్రహారములని చెప్పదగు గణపతి దేవ మనుమసిద్ధులే నాకగ్రహారములు. నాకోర్కె చెప్పెద వినుడు. నాప్రభువు నా మిత్రుడు నాశిష్యుడు నాప్రాణమునగు మనుమసిద్ధి మహారాజు శత్రుపరాజితుడై రాజ్యము గోలుపోయి నహుషునిచే నోడింపబడిన యింద్రుడుంబలె నొక మూలడాగియున్నవాడు. ఆతని మరల రాజ్యప్రతిష్ఠితునిం జేసి నెల్లూరుమండలమునకు బ్రభుదానంబు జేయుము".

అని పలుక గణపతి దేవుఁడు సంతసించి తిక్కనసోమ యాజి రాజభక్తికి మెచ్చి ప్రభువునిమిత్తమై యింతదూరము శ్రమపడి వచ్చిన వారుందురే యని యక్కజమునొంది మను మసిద్ధిని మరల సింహాసనప్రతిష్ఠుని జేయుదునని ప్రతిజ్ఞబూని సోమయాజిసహితుండై సైన్యంబులఁ దీసికొని నెల్లూరునకుఁ బోయి మనుమసిద్ధి శత్రువులం బరాజితులంజేసి యాతని సింహాసనప్రతిష్ఠితునింజేసి తిక్కనసోమయాజిని మంత్రిపదం బున నిలిపి మరల నోరుగల్లుపురంబునకుఁ జనియెను. ఈ కార్యముతో గణపతి దేవుని చరిత్రము పవిత్రమయ్యెను.

---

## పదవ ప్రకరణము

రామరాజు చెప్పినకథ జగన్నాథదాసు గృహయజ మానుఁడు మరియు నచ్చటఁ జేరిన గ్రామవాసులు మిక్కిలి శ్రద్ధతో నాలకించి త్వరితముగానె ముగిసిపోయినదని విచా రించిరి. తనవలెనేయందఱును గథాసమాప్తివిచారము గలి గించినదని తెలిసికొని గృహయజమానుఁడు రామరాజును జూచి "రాజుగారూ! నాదొక్క చిన్నమనవియున్నది. పాకనై పుణ్యము గలవారు పచ్చగడ్డినైన రుచిగల భక్ష్యము జేయఁ గలిగినట్లు సారములేని కథలనైనఁ గడు సారవంతములఁజేసి రుచి పుట్టింపఁగల నేర్పు మీవాక్కునందున్నది. అందుచేత

మీనోట మఱియొకకథ వినగోరుచున్నాడను. ఇప్పుడుప్రొద్దు పోలేదు. మరియొక కథ జెప్పుటకుఁ దగినకాల మున్నయది. కావున చక్కనికథ మఱియొకటి సెలవిండు. మార్గాయాసము చేత మిక్కిలి డస్సియుండిన కతమున మీరు విశ్రాంతిగోరుదు రేని తప్పక పండుకొనవచ్చును అట్లయిన రేపిక్కడనుండి మాయింట నాతోఁబాటుగ నింతకలియొ గంజియొ భుజియించి మీకథాసుధారసములచే మాచెవులకు విందులు గావించి యరుగవలయునని ప్రార్థించుచున్నాను. ఏకారణముచేతనైన రేపు మీరిక్కడ నుండుటకు వీలులేనిపక్షమున నీరాత్రియె తక్కినకథ జెప్పి పోవలయునని కోరుచున్నాను. నామనవి చిత్తగించి నాప్రార్థన మంగీకరించవలయును. ఇంత పట్టుల పట్టుచున్నావని మీరడుగుదురేమొ కారణము వినుఁడు. కథలు చెప్పుటలో మీవాక్చాతుర్యము మీనేర్పు నటుండనిండు. ఆవిశేషముగాక మఱియొక విశేషము గూడఁ గలదు. కథలు పలుమారు వినియున్నాము. అనేక చిత్రకథలు విని యున్నాను. కాశీమజిలీలు వినియుంటి. శుకసప్తతి హంస వింశతి లెక్కలేనిసారు లాకర్ణించితి. అట్టికథలు చెప్పెడువా రనేకులు కలరు. కాని యాంధ్రజాత్యౌన్నత్యమును గూర్చియు నాంధ్రప్రభువుల ప్రతాపసాహసములను గూర్చియు నిజమైన కథలు చెప్పువారు నాకింతవఱకు నెవరుఁ గనబడలేదు. మహానుభావుఁడగు తిక్కనసోమయాజినిగూర్చియు రాజాధి రాజయ్యు విద్వజ్జనవిధేయుఁడై మెలఁగిన గణపతిదేవుని గూర్చియు విన్నపుడు నాశరీర ముత్సాహముచేత గగుర్పొడిచి

నది. ఆవిధముగా బండితకవుల నాదరించు మహారాజులు వందలకొలది వేలకొలది యాంధ్రదేశమున జన్మింతురుగాక! ఆహాహా! యేమి? యాతిక్కనసోమయాజి రాజభక్తి ఆహాహా! యేమి? యాగణపతి దేవుని పండితభక్తి ఇట్టి కథాభోజనముల కిదియే ప్రథమప్రాశనము. అందుచేత మిమ్ము విడువఁదలఁచుకొనలేదు అని శ్లాఘాపూర్వకముగఁ బ్రసంగించెను. ఆ పలుకులు విని రామరాజు చిఱునవ్వునవ్వి గృహయజమానున కిట్లనియె. "అయ్యా! మీరు సెలవిచ్చిన రుచి కథలలో నున్నదికాని నావాక్కునందులేదు. నాయందలి ప్రేమాతిశయముచే మీరీవిధంబునఁ గొనియాడుచున్నారు. ప్రేమ లేని సద్గుణంబులఁ గల్పించు దానికేమి? రేపు నేనిక్కడ నుండుటకు వీలులేదు. నా మేనమామకు శరీరమునందస్వస్థముగ నుండుటవలన నేను గష్టపడి ప్రయాణములు సలుపుచున్నాఁడను. మీయాజ్ఞాప్రకారము నేను రేపిక్కడనుండి మీకోర్కె దీర్చి మిమ్ము సంతోషపెట్టఁజాలనందుకు విచారించుచున్నాను. అయినను మీమనోరథసిద్ధియగునట్లు నేఁటిరాత్రియేమఱియొక చమత్కారకథఁ జెప్పెద. అది ప్రతాపరుద్రదేవునిగూర్చినకథ. ఆంధ్రజాతీయుడనైన నేను మనజాతియందుజాతిరత్నములవలె జన్మించిదిగంతవిశ్రాంతకీర్తులై సర్వలోకమాననీయచరితులై తేజోరాసులై గతించిన గణపతిదేవ ప్రతాపరుద్రదేవప్రముఖ మహావీరుల యద్భుతచరిత్రలఁ జెప్పుటలో నాశ్చర్యములేదు. చెప్పకపోవుట యాశ్చర్యము. అట్లు చెప్పుట ప్రతిమనుష్యునకు

విధి. ఏజాతియం దుద్భవించినవా రాజాతియొక్క పూర్వ చారిత్రము స్మరణకుఁ దెచ్చికొనవలెను. అది యుత్తమచరిత్ర మైనప్పుడు స్మరింపవలయునని వేఱ చెప్పవలయునా? ప్రాచీన చరిత్రలు జీవములేని మనపాలిటివారికి ప్రాణప్రతిష్ఠావంత ములు. అవి యెండిపోయిన యెముకలలో వీరరసము గలి గించును. ఆకథలఁ దలంచి నప్పుడు నాహృదయ ముప్పొం గును. నన్ను నేమఱతును. అట్టివేళల నేను మఱియొక లోక ములో నుండును. ఇట్టి కథలు చెప్పిన నోరేనోరు ఆలకించిన చెవులే చెవులు. మన దేశము జీవనము గలిగి పునర్వృద్ధితో చెంపెసలార మనకిష్టముగలదేని జిన్నబిడ్డల కుగ్గుపాలతో దేశాభిమానగర్భితములైన ప్రాచీనాంధ్రరాజుల చరిత్రంబులు చెప్పవలయును. ఇదియే ద్విజులకు గాయత్రిమంత్రోపదేశము. ఈకథలు చెప్పుకొనని గృహము గృహముకాదని నాయభి ప్రాయము. అందుచేత నాకీ కథాకథనమునం దత్యంతాభి మానము. వినెడు వారున్న పక్షమునఁ జెప్పుటకు నాకెంతో యోపికఁ గలదు నేను మార్గాయాసము మఱచితి నిద్ర మఱ చితి. గణపతిదేవుఁడు నాస్మరణకు వచ్చుచున్నాఁడు. తిక్కన సోమయాజి పలుకులు నాచెవులలో ఖంగుఖంగున వినఁబడు చున్నవి. గణపతిదేవుని పుత్రిక యగు రుద్రమదేవి మూర్తి నాయెదుటఁ దాండవమాడుచున్నది. అదిగో ప్రతాపరుద్రుడు. మీకన్నుల కగపడకపోయినను నాకన్నులకు మూర్తీభవించిన వీరరసమువలె భూలోకమున నవతరించిన త్రిలింగదేశము యొక్క యదృష్టదేవతవలె నిట్టట్టు సంచారము. చేయు

చున్నాఁడు అదిగో మంత్రి యుగంధరుఁడు. ఈకథల మీకుఁ జెప్పుమనుచున్నాఁడు వినుండు.

ప్రతాపరుద్రుని కథ

గణపతిదేవునకు, బుత్రసంతానము లేదు. ఆయన కొక్క కుమార్తెమాత్రము జనియించినది ఆమెపేరే రుద్రమదేవి. పుత్రహీనుఁడైన గణపతిదేవుఁడు తనవంశపారంపర్యము నిమిత్తము మఱియొక కుఱ్ఱవానిం దెచ్చి పెంచుకొనక గుణవతియు విద్యావతియునగు తన కుమార్తెనే యోరుగంటి సింహాసనమందుఁ బ్రతిష్ఠించి సామ్రాజ్యభార మబలయగు నామె శిరస్సునఁబెట్టి కాలధర్మముఁ బొందెను. రుద్రమదేవి సామ్రాజ్య ధారంధర్యమునంది మగవాఁడైన నందునకు సాటిరారన్నట్లు ముప్పదినాలుగు సంవత్సరములు దేశపరిపాలనముం జేసి మగవారు పాలించినప్పటికంటెను రాష్ట్రమునకు నెక్కుడు శాంతి సౌఖ్యములను, వంశమునకు నెక్కుడు పేరుప్రతిష్ఠలను, శత్రుజనంబులకు నెక్కుడు భయభక్తులను గలిగించెను. ఆఁడుది గదాయని రాజద్రోహులు కొందఱు కుట్రలుపన్ని తమవంటి ద్రోహులనె కొందఱ వెంటఁగొని యల్లరి చేసి విజృంభించిరి గాని రుద్రమదేవి మహిషాసుర మర్దనివలె రాజనీతిబలములను మంత్రబలమును సేనాబలంబునకుం దోడుచేసి దేశద్రోహులైన యామూర్ఖుల నడంచెను. రుద్రమదేవియను స్త్రీ యోరుగంటి సింహాసన మెక్కి పరిపాలింపకపోయిన పక్షమునఁ దెనుఁగు

దేశమునకు స్త్రీపరిపాలనాసౌఖ్యము గలిగియుండక పోవును. ఆంధ్రదేశస్త్రీలుకూడ పురుషులవలెనే విద్దెలనేర్చి గద్దెల నెక్కి రాష్ట్రపరిపాలనముం జేయగలరను కీర్తి జగంబున వ్యాపించుట కవకాశము లేకపోయి యుండును. ఆంధ్రదేశ మాతృగర్భమున వెలలేని పురుషరత్నము లున్నట్లె య మూల్యము లగు స్త్రీరత్నములుగూడ నున్నవనియు నవ కాశ మున్నపక్షమున సానబట్టినపక్షమున వానిప్రాశస్త్యము లోకవిదిత మగుననియుఁ దెలిసికొనఁ గలము. రుద్రమదేవికి ప్రధానమంత్రి శివదేవయ్య యను బ్రాహ్మణుఁడు. రుద్రమ దేవికిఁ గూడ గణపతి దేవునివలెనే పుత్రసంతానము గలుగక యిద్దఱాఁడుబిడ్డలు మాత్రము జనియించిరి. ఉమ్మక్క దేవి యామె పెద్దకూఁతురు. ఆ కుమార్తెకె లోకఖ్యాతి యశ స్కుడైన ప్రతాపరుద్రదేవుఁడు జనియించెను. ఈతఁడు జన్మించినతోడనె రుద్రమదేవి నేఁటి కాలమునకుఁ దన యింట మగబిడ్డఁడు జన్మించెఁగదాయని పరమానందము నొంది బొడ్డుకోసి స్నానము చేయించిన వెంటనే యా పసి పాపని గణపతిదేవుఁడు మొదలగు మహాప్రభువు లధిష్ఠించిన యోరుగల్లు సింహాసనముపై బండుకొనఁబెట్టి క్షణకాలమం దుంచి మరలఁ బురిటియిల్లు చేర్చెను. ఓరుగంటిపురమునం దప్పుడు జరిగిన మహోత్సవములు వర్ణింపనలవిగాదు. గణపతి దేవుని తరువాత కాకతీయవంశమున మగమొలక ప్రతాప రుద్రుఁడే యగుటంజేసి తనయమ్మకు నవ్వాకుఁ బట్టములకు

మంత్రివర్గమునకుఁ బ్రకృతిజనంబులకుఁ గనుల చందమామ యై మనోరథమై యల్లారు ముద్దుగఁ బెరిఁగెను.

ప్రతాపరుద్రుఁడు యుక్తవయస్కుఁడైనతోడనె రుద్రమదేవి రాజ్యముంజాలించి మనుమని సింహాసన ప్రతిష్ఠితునిం జేసి గణపతిదేవుని ఖడ్గమాతనికిచ్చి స్త్రీసామాన్యసులభమైన యంతఃపురవాసమును స్వీకరించెను. ఇట్లనుటకుఁ గారణ మే మనఁగా రుద్రమదేవి రాజ్యమేలినకాలమునఁ బురుషవేషము వేసికొని కొలువుకూటమునకు వచ్చి సింహాసనమెక్కి రాజకార్యవిచారణము జేయుచుండెడిదని గ్రంథములు నుడువుచున్నవి. మంత్రులయాలోచనమునకు మాతామహ్యుపదేశము తోడుగాఁగ బ్రతాపరుద్రుఁడు నిరుపమాన నైపుణ్యముతో లోకాతీతప్రజ్ఞతోఁ ద్రిలింగదేశమును బాలించి యటు తుంగభద్రవఱకు నిటుగోదావరివఱకుఁ బడమట దేవగిరిరాజ్యము వఱకు ద్రిలింగసామ్రాజ్య వృక్షముయొక్క శాఖలువ్యాపింప జేసి విద్వజ్జనవిధేయుఁడై శత్రుభయంకరుఁడై చిరకాలముభూమి బాలించెను. వాల్మీకిరామాయణముం దెనిఁగించిన హుళక్కి భాస్కరుఁడు, మార్కండేయపురాణము నాంధ్రీకరించినమారనకవియు శ్రీప్రతాపదేవుని యాస్థానమునందున్న యాంధ్ర మహాకవులే. ప్రతాపరుద్రీయమని యలంకారశాస్త్రము రచియించి తన స్వామికీర్తి నాచంద్రార్కముగ మహీమండలమున నిలిపిన విద్యానాథుఁ డను పండితశిఖామణి యారాజచూడామణియొక్క యాస్థానగీర్వాణకవి. వేయేల! యీతని

కొలువుకూటము పండితుల కునికిపట్టు; సరస్వతీదేవికి నర్తన శాల. లక్ష్మీదేవికి రెండవ విష్ణువక్షస్థలము; ప్రతాపరుద్రుఁడు తన సత్పాలనముచేత రుద్రమదేవిని గణపతిదేవుని మఱపించెను. ఈతని కాలమునందు మన దేశమందలి రెడ్లు, వెలమలు, కమ్మవారు, కాపులు స్వామినిమిత్తము బహుయుద్ధములందొలి శూరశిఖామణులై పేరెన్నికగాంచి ప్రతాపరుద్రుని మన్ననవడసి యాతనిచేత మాన్యంబులు సంస్థానంబులు బహుమానంబులుగ గ్రహించి యిప్పటివఱకు నాంధ్రభూములయందు రాజ్యము లేలుచున్నారు. ఆసంస్థానంబులె యిప్పుడు గోల్కొండకు లోఁబడియున్నవి. ఇప్పటికిఁ బ్రతాపరుద్రుఁడు గతించిన మూడువందల యేఁబది సంవత్సరములైనను నాతని యద్భుతచరిత్రలు చెప్పుకొననివారు విస్మయముగ విననివారు లేరని చెప్పుట యతిశయోక్తి గాదు.

## ప్రతాపరుద్రుని పరాజయము

మహమ్మదీయులు హిందూదేశము మీఁద దండెత్తి వచ్చి హిందూరాజుల నోడించి క్రమక్రమముగ నొక్కొక్క స్వదేశసంస్థానమును జయించి యాక్రమించుకొని ఢిల్లీనగరము రాజధానిగఁ జేసికొని యక్కడ సామ్రాజ్య సంస్థాపనము జేసికొని కొంతకాల ముత్తర హిందూస్థానమును బాలించి తరువాత దమదృష్టి దక్షిణహిందూస్థానము వైపు ద్రిప్పిరి. దక్షిణహిందూస్థానమందలి రాజ్యములలో నానాఁడు

రెండు ప్రసిద్ధికెక్కియుండెను. అందు మొదటిది దేవగిరిరాజ్యము. ఇది మహారాష్ట్రసామ్రాజ్యము. రెండవది యోరుగల్లు సామ్రాజ్యము. ఇవి యుత్తరహిందూస్థానమునకు సరిహద్దులలోనున్న దక్షిణహిందూస్థాన రాజ్యములు. మహమ్మదీయుల ప్రతాపాగ్నికి దేవగిరిరాజ్యము మొదటి యాహుతి యయ్యెను. ఆదేశపురాజగు రామదేవుడు మహమ్మదీయుల కోపానలంబునకు మిడుతయై చనిపోయెను. తరువాత నాతని కుమారుఁడగు హరిపాలదేవుఁడును దండ్రిమార్గము ననుసరించెను. తరువాత మహమ్మదీయులు తమ సైన్యప్రవాహము నోరుగల్లుకోట మీదికిం ద్రిప్పిరి. మేఱమీఱి పొంగిపొరలి వచ్చుచున్న మహమ్మదీయ సేనాసమూహమున కోరుగల్లుకోట చెలియలికట్టయై యుద్రేకము నడంచెను. మహమ్మదీయులు మూడుసారు లోరుగల్లు ముట్టడించిరి. మూడుసారులు మహమ్మదీయులు కమ్మదొరలచేత, వెలమదొరలచేత, రెడ్డినాయకుల చేత, క్షత్రియశూరులచేత బరాజితులై చచ్చినంత మంది చచ్చి పాఱిపోయినంతమంది పాఱిపోయి యోరుగల్లునకొక్క సలాముచేసి దానిని జయించుట కాశ వదలికొనిపోయిరి. ప్రతాపరుద్రుఁ డీయుద్ధములలో జయించెను. కాని యాతని విజయము మహాభారతయుద్ధమందలి పాండవవిజయమువలెనే యుండెను. ఏలయన బంచపాండవులు గెలిచినారని పేరేగాని బిడ్డలు చుట్టములు బూత్తిగ నశించిరి. అట్టిజయ మెవడు సంతోషించినజయము, ఎవఁడు మెచ్చినగెలుపు. అట్లెప్రతాప

రుద్రదేవుని గెలుపును. కీర్తిప్రదమేకాని లాభకారి కాక పోయెను. ఎందుచేతనన నదివఱకు మహాయుద్ధములలో ముక్కాకల దేఱి పేరువడిసిన మెఱియలవంటి మహాయోధులు సామ్రాజ్యప్రపంచమును వహించు దిగ్గజములనఁ దగు మేటిమగలు నేలం గూలిపోయిరి. అందుచేత సామ్రాజ్యలక్ష్మికిదగిన రక్షకులు లేకపోయిరి. ఓరుగల్లు రాజ్యలక్ష్మి సహాయ శూన్యరాలై యున్నదనివిని మహమ్మదీయులు మఱియొకసారి యాపురముపై దండెత్తివచ్చిరి. పూర్వదండయాత్రలో సంగుళాంగుళమునకు నడుగడుగునకు నడ్డుపెట్టి మహమ్మదీయుల రాకను నిరోధించిన మేటిమొనగాండ్రు లేకపోవుటచే దురక లోరుగంటికి సుఖప్రయాణము జేసిరి. మూడుసారులు మహమ్మదీయుల ధాటికి చెక్కుచెదరక నిలిచి యోరుగల్లు సామ్రాజ్యమును రక్షించి కోటగోడలు మహమ్మదీయుల ఫిరంగిదెబ్బలకు వేఁటకాని వింటినుండి వెడలు మంటి యుండదెబ్బలు తగిలి నేలరాలు పక్షులవలెనే గుభాలుగుభాలున గూల నారంభించెను. కోటగోడలలోఁ బడిన సందుదారులనుండి మందమందలుగ మహమ్మదీయులు పురముఁ బ్రవేశించి చేయఁగల ఘాతయంతయుఁ జేసిరి.. ఇది ప్రవేశింపఁదగినచో టిది ప్రవేశింపదగనిచో టని వారు విమర్శింపలేదు. ఇది చేయఁదగిన కార్యమది చేయరాని కార్యమని వారు సందేహింపలేదు. ఇది యనఁదగినమాట యది యనరాని మాటయని వారు వెనుదీయలేదు. అంతఃపురము లని యనుమానింపలేదు. దేవాలయములని తిరిగి వెళ్ళలేదు.

శిశువులని చింతింపలేదు. అంగనలని యాలోచింప లేదు. నాలుగువందల సంవత్సరములనుండి కాకతీయ వంశస్థులు రాజ్యబలముచే సంరక్షింపఁబడి యానాఁటికిఁ బ్రతాపరుద్ర దేవుని యధీనములో నుండిన యారాజ్యలక్ష్మి క్షణములో మహమ్మదీయుల పాలయ్యెను. రాజ్యలక్ష్మితోఁబాటు పట్టణ మువారి యధీనమయ్యెను. పట్టణముతోఁబాటు రాచనగరు గూడ వారిచేఁ జిక్కెను. నగరుతోఁబాటు నరపాలుఁడు ప్రతాపరుద్రుఁడు వారి హస్తగతుఁ డయ్యెను. తమ ధాటికి మున్మూరు మొక్కవోని యుక్కుగోడలవంటి యోరుగంటి కోట గోడలు నేలంగూలి సందిచ్చినందుకుఁ బురప్రవేశము తమకుఁ గలిగినందుకు జయము చేకూరినందుకు మహానంద భరితులై యున్న మహమ్మదీయులకు, మహమ్మదీయప్రతా పానల కాలమేఘుఁడై భూలోకదేవేంద్రుఁ డైన యఖండ ప్రతాపరాశియై యున్న ప్రతాపరుద్రదేవుఁడు చేఁజిక్కిన తోడనె కలిగిన యానందపారవశ్యము నింతింతయని వర్ణింప నలవిగాదు. వారు ప్రతాపరుద్రుని ఖైదీగ ఢిల్లీకిఁ గొనిపోయి తమ సుల్తానునకుఁ గానుకగనిచ్చిరి. ప్రాణమువలె నుండిన ప్రతాపరుద్రుడు విడిచినతోడనె యోరుగల్లు శవమయ్యెనని వేఱ చెప్పనేల? కాలు చేతులు కన్నులు ముక్కు చెవులు గలిగియు శవము నిష్ప్రయోజన మైనట్లె కొందఱు మొన గాండ్రు కొన్నిసేనలు కొన్ని గజరథతురంగములు నిలిచి యున్న నవియెల్ల నిరర్థకము లయ్యెను. ఓరుగంటినుండి యాత్మ లేచిపోయెను. ప్రాణములు పోయెను. జీవకళ తొలంగెను.

మాంగల్యము మాసిపోయెను. శోభ శూన్యమయ్యెను. మహాలక్ష్మి విహరించు మందిరంబు పాడుకళ వహించియుండెను. జనులకుత్సాహ ముడిగెను. ఎచ్చటఁజూచిన శత్రు విజృంభణము హెచ్చెను. పట్టణమంతయు హాహాకారము లెసఁగెను. ఓరుగంటిపురవాసులు రాజునిమిత్తమై తమబంధువు లెవరో పోయినట్లు విలపించిరి. ఇట్టి సమయములోఁ బురజనులను రాజకుటుంబమును సామ్రాజ్యమును నుద్ధరింపఁగల రాజనీతికోవిదుఁడు తేజోరాశియొక డాకాశమునుండి దిగివచ్చినట్లు దమరాజుం దమకిచ్చిన బాగుండునే యని జనులాలోచింపఁ దొడంగిరి.

## మంత్రి యుగంధరుఁడు

ఆపత్కాలము వచ్చినప్పుడు దానినుండి విపన్నుల నుద్ధరించుటకు సమర్థులగు మహాపురుషులు కాలానుసారముగఁ గానఁబడు చుందురు. నివురుగప్పిన నిప్పువలె వారది వరదాక నడఁగియుండి సమయము వచ్చినప్పుడు తమ తేజమును జూపుదురు. ఆకాలమునఁ బ్రతాపరుద్రదేవుని మంత్రులలో నొక బ్రాహ్మణుఁ డుండెను. అతండు మిక్కిలి బుద్ధిమంతుఁడు; ప్రతాపరుద్రునకు నమ్మినబంటు. శుక్రనీతి కామందకము మొదలగు రాజనీతిశాస్త్రములయం దతని కసమానప్రజ్ఞ గలదు. సామదానభేదదండములనియెడు నాలుగుపాయములను శత్రుమండలముపైఁ బ్రయోగించుటలో నాతఁడెవ్వరికిఁ దీసిపోవువాఁడు కాఁడు. ఆతఁడే కార్య మెందుకు

చేయుచున్నాఁడో దాని ఫలమునుబట్టి జనులూహింపవలసి నదె కాని యాతనినోటి మాటలవలనగాని యితరచర్యల వలనఁగాని తెలియదు. ఆతఁడు పలుమాఱులు మాఱువేష ములు వేసికొని రాజునకుఁ గాని మఱియెవ్వరికిఁ గాని తెలి యని యద్భుతరహస్యములను గ్రహించి యెన్నిపర్యాయ ములో తన యేలికకు దుస్సాధ్యములైన కార్యములు సాధిం చెను. ప్రతాపరుద్రుఁడు మహమ్మదీయులచే ఢిల్లికి బందెగఁ గొనిపోఁబడుటచే దుఃఖసముద్రమున మునిఁగియున్న రాజ మాత కుశాగ్రబుద్ధియగు మంత్రిని బిలిపించి విపత్సముద్రము నుండి సముద్ధరింపవలసినదని ప్రార్థించెను. ఆ ప్రార్థనమువిని యామంత్రి శిఖామణి యిట్లని ప్రతాపరుద్రుని తల్లికిఁ బ్రత్యు త్తర మిచ్చెను.

"అమ్మా! ఈకార్యమునకై నన్ను మీరింతప్రార్థింప వలసిన పనిలేదు. ఈశరీరము మీసొమ్ముతోఁ బెరిఁగినది. అందు నాదేహమును మీనిమిత్తమె వినియోగించెదను. సద్గుణ రత్నాకరుఁడై ప్రతాపరుద్రదేవమహారాజునుగన్న యోతల్లీ! నీవు ప్రతాపరుద్రునకొక్కనికెతల్లివిగావు. ఓరుగంటిసామ్రా జ్యమందలి జనులకందఱకుఁ దల్లివి. నీదుఃఖమందఱిదుఃఖము. నీకుమారరత్నమే నీకు దూరమయ్యెను. ప్రజలకు సకలసౌఖ్య ములు దూరమయ్యెను. ప్రజల కాప్తబంధులందఱు దూరమై నట్లున్నది. కాఁబట్టి నేనునారాజును మరలఁదెచ్చుటకై ప్రయ త్నించెదను. ఆఱుమాసముల కాలము నాకు గడువిమ్ము.

ఈయాఱునెలలలో నాసకలసామర్థ్యములం బ్రయోగించి నీ పుత్రుం దెచ్చి నీకప్పగించెద. అట్లు చేయనైతినేని నేనాంధ్ర మాతగర్భంబు చెడఁబుట్టినవాఁడను. భూమికి భారమైనవాఁడను. ఓరుగంటి కప్రతిష్ట దెచ్చినవాఁడను. ప్రతాపరుద్రుని దేలేకపోతినేని నేను మరల నోరుగంటికి రాను. యమునానది యె నాసమాధి యగును.''

అనవుడు రాజమాత సంతసించె. మంత్రి పయనమై యరిగె. ఈమాట లెవ్వరు వినలేదు. ఆతఁ డెం దరిగెనో యెవ్వరికిం దెలియదు. తీర్థయాత్ర కరిగినాఁడని జనులు చెప్పుకొనసాగిరి. మఱియొక నరపాలుని యొద్ద నుద్యోగమున కరిగెనని కొంద ఱూహించిరి.

ఆకాలమున మహమ్మదుబీనుటోగ్లా కనునతఁడు ఢిల్లీ చక్రవర్తి. ఆతఁడు క్రూరుఁడు, దయాళుఁడు, మేధానిధి, పరమ మూర్ఖుఁడు. ఇట్టి యద్భుతగుణములుగల యాచక్రవర్తి పురుష రూపము ధరించివచ్చిన మృత్యుదేవతయో యనునట్లు లక్షల కొలఁది జనులను నిష్కారణముగ జంపించి దానివలనఁ బర మానందము నందుచు వచ్చెను. ప్రతాపరుద్రుని బట్టుకొని సైన్యనాయకులు ఢిల్లీకిపోయి యాతని దమచక్రవర్తికిఁ జూపి నపుడు ప్రతాపరుద్రుని సుందరవిగ్రహమును వచోనైపుణి యాత్మగౌరవము స్వయముగఁ జూచి యచ్చెరువడి తనక్రూర భావము వెలిబుచ్చక యాతనిసగౌరవముగనాదరింపవలసినదని

పైన నాయకుల కుత్తరవుజేసి యొకచక్కని మేడ వానికిబసగ నేర్పఱచెను. పండితులెవరైనఁ బ్రతాపరుద్రుని జూడవచ్చిన పక్షమున వారి నాయనవద్దకు బంపించవలసినదని సైనికుల కాజ్ఞాపించెను. వారట్లు చేయుచు వచ్చిరి. విద్యానాధుఁడను పండితుఁడు గొప్ప యలంకారశాస్త్రముఁ దాను రచించి ప్రతాపరుద్రున కదియంకితముచేసి ప్రతాపరుద్రీయమనిదానికి పేరువెట్టి రాజునకు వినిపించి మెప్పువడసి మాన్యంబులో యగ్రహారములో పారితోషికము బడయవలయునని యోరుగంటికి బోయెను. పండితులు దరిద్రులన్నమాట యబద్ధమగునా? అదృష్టదేవత విద్యానాధుని విడిచినట్లు ప్రతాపరుద్రు నోరుగల్లు విడిచిపోయెను. విద్యానాధు డప్పులపాలైనట్లె ప్రతాపరుద్రుడు పగవారిపాలయ్యెను. విద్యానాధుని యింటి యందువలెనే యోరుగల్లు పురమందుగూడ దరిద్రదేవత తన ధ్వజమునాటెను. ప్రతాపరుద్రు డోరుగల్లులో లేడనివినగానె విద్యానాధుని యాశలన్నియు నడుగంటెను. ఏమయినను సరియె అతఁడు తెగించి యోరుగల్లునుండి ఢిల్లీనగరమునకు వెళ్ళి చక్రవర్తి యనుజ్ఞ నడసి తన మనోరధమగు ప్రతాపరుద్రమూర్తిని సందర్శించి తనవచ్చిన కార్యమాయనకు విన్నవించి గ్రంథము వినవలయునని ప్రార్థించెను. అప్పుడు ప్రతాపరుద్రుఁ డిట్లని ప్రత్యుత్తరమిచ్చెను. "కవిరాజా! రాజ్యము గోలుపోయి లక్ష్మి నెడబాసి పగవానిచేతిలో బందెనైయున్న నావంటి మందభాగ్యునకు గ్రంథ మంకితము చేసినందులకు

మీకుఁ గలుగు లాభ మేమి? నేను మాన్యము లీయజాలను. మెచ్చి తలయూపులతోఁ గడుపునిండునా? అందుచే మఱి యొక మహారాజున కెవ్వనికైన మీగ్రంథ మంకితము జేసి మీ మనోరథసిద్ధిఁ బడయుఁడు.''

అనవుడు విద్యానాథుఁ డిట్లనియె—''రాజేంద్రా! బందెలోనున్నను నీవు మహారాజువె. మాన్యము లిచ్చిన నగ్రహారములిచ్చిన మాదారిద్ర్యము తీరునా! సరసుఁడగు మీవంటి మహారాజు మఱియొకఁడు నాకింక దొరకఁడు. ఈ గ్రంథము నీవంటి విద్యాశాలి విని సంతసించి భళియని తల యూఁచినపక్షమున నదియె నాకు మాన్యము; నదియె నా కగ్రహారము; నదియె నాకు శతకోటిధనము. సారస్య మెఱుగని మూర్ఖప్రభువునొద్ద లక్షవరహాలు బహుమానముఁ బడయుట కంటె సారస్య మెఱిఁగిన పేదవానివద్ద నొక మెప్పుమాట బడయుటగొప్ప. నీవేమియు నాకీయనక్కఱలేదు. నీవిప్పుడు ధనమునఁ బేదవయ్యు జ్ఞానమున సంపన్నుఁడవు నీవియ్యలేదని నాకు విచారములేదు. శ్రద్ధగా గ్రంథము మాత్ర మాలకిం పుము'' అనవుడు రాజు వల్లెయని దత్తావధానుఁ డయ్యెను. విద్యానాథుడుఁడు ప్రతాపరుద్రీయమంతయు నాతనికి విని పించెను. ప్రతాపరుద్రుఁ డాతని కవిత్వమునకుఁ గల్పనలకు మెచ్చి యటువంటి మహాకవికిఁ దగిన పారితోషిక మియ్యఁ జాలని యవస్థలో నున్నందుకు మాత్రము మిక్కిలి విచారించెను.

## యుగంధర కార్యనిర్వహణము

ఒకనాఁ డుదయమున ఢిల్లీనగరమునఁ జక్రవర్తి కోట యెదుటనున్న వీధిలో నొకమనుష్యునిచుట్టు జను లనేకులు గుంపుగూడియుండిరి. అతని సంభాషణమునుబట్టి యాతడు పిచ్చివాఁడని కొందఱు దయ్యముపట్టినదని కొందఱు సంధిం చినదని కొందఱుఁ జెప్పుకొనసాగిరి. "అయ్యో! నాచంద్రుఁడు లేఁడు నాచంద్రుని దురకచక్రవర్తికోటలోఁ బెట్టుకొన్నాఁడు. నాచందమామను నేనుదీసికొనిపోక మానను. నాచందమా మను దెచ్చినందుకు ఢిల్లీసుల్తానునుగూడ నాలోకమునకుఁ దీసి కొని పోవుదును. ఏఁడీ నాచందమామ యేగదిలో నున్నాఁడు? చందమామ రారా! కుందమామ రారా!" యని యర్థము కానిమాటలను బలుకుచు సందర్భములేని పాటను బాడుచు నాతఁడు వివిధములగు విపరీతచేష్టలు చేయఁదొడగెను. చుట్టు నున్నవారి నొకసారి తిట్టును. మఱియొకసారి పొగడును. కారణములేకయే యొకసారి నవ్వును. ఇంకొకసారి వెంటనే యేడ్చును. వెక్కిరించును. పండ్లు కొఱుకును. బెదరించును. మొగము చిట్లించును. జుట్టు పీకికొనును. పైనున్న బట్టలు జింపికొనును. గుడ్డపేలికలు నాముత్యాలహారము లివిగో నాకుఁ జక్రవర్తియిచ్చిన బహుమానము లివిగో యని మెడలోఁ దాల్చును. దుమ్ము పైకెగురఁబోసి పుష్పవర్షము గురియు చున్నదని కేకలువేయును. వీధిలోఁ గనఁబడిన గుడ్డపేలికలు

చింకిచాపలు ప్రాతచేదలు కొడుముక్కలు చిల్లపెంకులు బొమ్మరాళ్ళు నిటుకబొంతలు పోగుచేసి మూటగట్టుకొని యామూట నెత్తినిబెట్టుకొని దానిని ప్రాణపదముగాఁ గాపాడుచుఁ దిరుగును. కూర్చుండికూర్చుండి యొకసారి హటాత్తుగా లేచును. లేచి నిష్కారణముగఁ బరుగెత్తును. ఇట్టి చేష్టల జూచి యాతఁడు తప్పక పిచ్చివాఁడని ఢిల్లీపురవాసులు నిశ్చయించిరి. జాలిదలఁచి యన్నము బెట్టవచ్చిన వారిని దూషించును. ఒకవేళ నన్నము గ్రహించినను దానిని దినక మేనిపైఁ జల్లుకొనును. ఈతని చేష్టలఁజూచి యెల్లవారు పిచ్చివాఁడను కొన్నను ఢిల్లీనగరమందలి కొత్వాలగు నాజరుఖాన్ మాత్ర మాతడు పిచ్చివాఁడగునో కాదో గట్టిగాఁ బరీక్షింపవలయు నని సంకల్పించి యొకనాఁడు రాజభటులం బిలిచి "వీఁడు నిజముగా వెఱ్ఱివాఁ డగునో కాదో మనము పరీక్షింపవల యును. కావున నేటిపగలు రాత్రి మీరు వీని వెనువెంట నంటి తిరిగి వీనిచేష్టల నన్నిటిని నాకు నివేదింపవలయు"నని యాజ్ఞాపించెను. రాజభటులు సరేయని యాతని వెంబడించిరి. రాత్రిఝాముగునప్పటికి వెఱ్ఱివాడు యమునా తీరముననున్న శ్మశానమునకు బోయి యమునలో స్నానముచేసి యక్కడ నొకపొయిపెట్టి వంటజేసికొన నారంభించెను. రాజభటులు వానికి గనబడకుండ ప్రక్కనున్న యొక మఱ్ఱిచెట్టునెక్కి కూర్చుండిరి. అంతలో వెఱ్ఱివానికొక యావులింతవచ్చెను. వింతలేని యావులింత రాదని వెఱ్ఱివాడు తనలో ననుకొని నలుదెసల బారజూచెను. చెట్టుమీాద మనుష్యుల యలుకుడు

వానికి వినవచ్చెను. వెంటనే యతడొక కఱ్ఱదీసికొని యన్న ముడుకుచున్న కుండవైపుజూచి 'గుడగుడశబ్దం కుండకు నష్టమ్' అని బిగ్గరగా నఱచుచు గఱ్ఱతో కుండ పగుల గొట్టెను. పగులగొట్టి రివ్వున బాణమువలె బాఱిపోయెను. రాజభటులు వానిచేష్టలు చూచి కొత్వాలునద్దకు బోయి యావృత్తాంత మెఱిగించి వాడు తప్పక పిచ్చివాడే యని ధ్రువముగ జెప్పిరి. అది విని కొత్వాలు తప్పక యాతడున్మత్తు డనుకొని యూరకుండెను. వెఱ్ఱివా డదిమొదలుకొని 'ఢిల్లీ సుల్తాన్ పట్టుక పోతాన్' అని కేకలు వేయుచు వీధులవెంట దిరుగజొచ్చెను. పిచ్చివాని ప్రేలరితనము నెవ్వరు సరకు సేయుదురు ?

ఇట్లు కొంతకాలము జరుగ నొకనాడు యమునానది లోనికొక యోడవచ్చెను. ఆయోడ నేలవచ్చె ననియు నందులో నేమి సరకులున్నవనియు గొత్వాలు వారి నడిగెను. ఢిల్లీ చక్రవర్తి ధరింపదగినట్టియుఁ దన యంతఃపురస్త్రీల నలంకరింప దగినట్టియు నవరత్నము లందున్నవని నావికుడు ప్రత్యుత్తర మిచ్చెను. కొత్వాలు వాని నొకసారి చూడ నియ్యవలసినదని కోరగా నావికుడు వానిని నోడలోనికి దీసి కొనిపోయి నానారత్నములు జూపెను. కొత్వాలు మహా ద్భుతరస మగ్నుడై వానిని జూచి "అయ్యా! చక్రవర్తి గారిని దీసికొని వచ్చి యీ రత్నములను ఖరీదు చేయించెదను. నాకేమి బహుమాన మిచ్చెద రని యడిగెను. "ముందుగా దీనిం దీసికొనుము చక్ర

వర్తిగారిచేత గొప్ప బేరము చేయించెదనేని మఱియు గొప్ప బహుమాన మిచ్చెద'' నని యొక ముత్యాలహారముదీసి నావికుడు వానిమెడలో వైచెను. లంచగొండియగు కొత్వాలు మిక్కిలి సంతసించి చక్రవర్తి కడకుబోయి యారత్నముల విలువ, కాంతి, జాతి మొదలగు సకల లక్షణముల వేనోళ్ళ వర్ణించి యవి తప్పకచక్రవర్తి సంపాదింపదగినవని నొక్కి చెప్పెను. చక్రవర్తి యోడలోనికిబోయి మరునాడు రత్నముల గొననిశ్చయించుకొనెను కాని రత్నపరీక్షయందు సమర్థులైనవారు ఢిల్లీనగరమున నాకాలమున లేకపోయిరి. ప్రతాపరుద్రుడు రత్నపరీక్షలో నసమానుఁడని కొత్వాలు చక్రవర్తితోఁ జెప్పెను. అట్లయిన నాతని దోడ్కొనిపోవచ్చునని చక్రవర్తి నిశ్చయించుకొని మరునాఁ డుదయమునఁ బ్రతాపరుద్రునిం బిలిపించి తనతో రత్నపరీక్షకై రమ్మని యడిగి యాతనిగలిసి కొంతపరివారముం గూర్చుకొని యోడలోనికిఁ బోయెను. చక్రవర్తి యోడలోఁ బ్రవేశించినతోడనే నావికుఁ డాతని మిక్కిలి గౌరవించి మిక్కిలి రుచ్యములైన భక్ష్యము లాతని కుపహారములుగఁ బెట్టి సువర్ణపీఠముపై గూర్చుండబెట్టి ఘుమఘుమ తావుల దిక్కుల వెదజల్లుచున్న యత్తరు, పన్నీరు, పచ్చకర్పూరము, కస్తూరి, కుంకుమపువ్వు మొదలగు పదార్థములు వానికి సమర్పించి యమూల్యమగు చీనిచీనాంబరములు శాలువలు మొదలగునవి గప్పి యాతని నానందమహాబ్ధి నోలలాడించెను. తరువాత క్రొత్తక్రొత్త మద్యములను సారాయములను సమర్పించి త్రాగించిరి. అట్ట

బహుమానములనె యట్టి మద్యములనె యట్టి సారములనె ప్రతాపరుద్రునకుఁ దక్క తక్కిన పరివారమునకిచ్చి వారిని సంతుష్టాంతరంగులఁ జేసెను. అంతలో వెఱ్ఱివాఁడు చేదల దండ మెడలో వేసికొని చింకిచేటయొకటి యెడమచేతఁబట్టి కుడిచేతనున్న యొకపుల్లతో దాని పై వాయించుచు 'ఢిల్లీ సుల్తాను పట్టుకపోతాన్' అని కేక వేయుచు నోడయెక్కెను. ఓడ కళాసులుగాని నావికుఁడుగాని యెక్కకుండ వాని నాటంక పెట్టలేదు. పిచ్చివాఁడు వానిజోలి మనకెందుకని చక్రవర్తిభటు లూరకుండిరి. చక్రవర్తి యంతట ప్రతాపరుద్రునితోఁ గలిసి రత్నపరీక్ష జేసెను. ఉసిరికాయ లంతలు కట్టామణిముత్యములుగల హారములెన్నో చూచిరి. రత్నాల హారములు పచ్చలదండలు వజ్రములు దాపిన యమూల్యములగు నుంగరములను వారెన్నిచూచిరో లెక్కించుటకు వీలులేదు. రత్నములే ముద్దులు మూటగట్టుచుండెను. అవి దాపిన బంగారునగలు నగిషీపనులతో నిండియుండ యంత కంటెముద్దులు మూటకట్టుచుండెను రత్నముల జాతిమెచ్చి నగలమీఁది పనిమెచ్చి వహ్వారేవహ్వా యని చక్రవర్తి పలుమారుపలుకుచువచ్చెను. చక్రవర్తి కేదిచూచిన నదియె కొన బుద్ధివేసెను. ఒకదానిని వదల మనసురాదయ్యెను. అన్నిటిని గొనుటకు ధనములేదని విచారించెను. ఢిల్లీసామ్రాజ్యమంత యునమ్మివేసినను మణులంగొనుటకుఁ దగిన ధనమురాదని యాతఁడు తెలిసికొనివిచారగ్రస్తుఁడయ్యెను. బ్రతాపరుద్రుఁడు

ప్రతివస్తువుయొక్క వెలయు నాతనికి సరిగా నెఱింగించెను. లక్షలు, కోట్లువిలువగల రత్నములేగాని, వందలు, వేలు వెల గల మణులందు లేనేలేవు. అంతలోఁ చక్రవర్తికి మున్ను త్రావిన సారాయములు కైపెక్కుటచే నిద్రవచ్చెను. అతఁ డొక మెత్తని పాన్పుపైఁ బవళించెను. పరివారమున కంతకు ముందే కైపెక్కెను. అందుచే వారంతకుమున్నె నిద్రించిరి. చక్రవర్తి శయనించినతోడనె యోడ నడువఁ జొచ్చెను.

ప్రతాపరుద్ర బంధవిమోచనము

ఓడ రేవులోనుండి బయలుదేఱి యమునానదిమీఁదఁ బ్రయాణముచేయ నారంభించెను. ఓడకళాసులు తెరచాపలు విప్పి కట్టిరి. నీటివాలునకుఁ దోడు గాలిపాటు మిక్కిలి యను కూలముగా నుండుటచే నోడ మిక్కిలి విసురుగాఁ బోవు చుండెను. కళాసులు తమలోదాము ముసిముసినవ్వులు నవ్వు కొనుచుఁ జిత్రచిత్రసంభాషణలు చేయుచు నెడనెడఁబాటలు పాడుచు నావనడిపింప జొచ్చిరి. ఢిల్లీచక్రవర్తికిఁ గాని యాతని పరిజనులకుఁగాని సాయంకాలమువఱకు నిద్రనుండి, కాదు కాదు మత్తునుండి తెలివిరానేలేదు. నావ యేలనడచుచున్నది యెక్కడికి బోవుచున్నది యని యడుగువారు కాని నిరోధించు వారు కాని లేకపోయిరి. యమునానదిమీఁద నావనడచినట్లె వారి మనస్సులుగూడ మహానందసముద్రమునఁ బ్రయాణము జేయఁ జొచ్చెను. ఓడ క్రమక్రమముగా యమునానదినుండి

గంగానదిఁ బ్రవేశించెను. సూర్యాస్తమయమయిన తరువాత గొంతసేపటికి జక్రవర్తికి మెలఁకువవచ్చెను. కాని నావికుఁడు వెంటనే మరికొన్ని మద్యములం దెచ్చి యాతనికి సమర్పించి త్రాగించి మత్తుమేఘముచే నాతని జ్ఞానసూర్యమండలమును గప్పించెను "యథారాజా తథాభృత్యా" అని చెప్పఁదగినట్లు భృత్యుల యవస్థగూడ నట్లే యుండెను. నిరంకుశమైన మద గజేంద్రము మహావనంబునంబడి నిరాఘాటసంచారము చేయు నట్లు నావ యమునా గంగానదీ జలప్రపంచమున నిర్నిరోధ విహారము జేయఁ జొచ్చెను. చుక్కాను త్రిప్పువాడు నేర్పరి యగునేని యోడ సరిగా నడచుట కేమి యాటంకముండును. అట్లే తంత్రము నడపువాడు నిపుణుడైన పక్షమునఁ బ్రారం భించిన కార్యము నిరంతరాయముగ జరుగును. ఆరాత్రి నిశ్శబ్దముగఁ గడచెను. చెఱసాల జేరినది మొదలుకొని సరిగా నిదుర యేమో యెఱుంగని ప్రతాపరుద్రదేవుఁడు నావమీఁద నారేయి గుండెపై జేయినైచుకొని సుఖముఁగా నిద్రించెను. అంతట గ్రమక్రమముగఁ దెల్లవాఱెను. ఢిల్లీచక్ర వర్తికి సంపూర్ణముగఁ దెలివివచ్చెను. ఢిల్లీపట్టణముగాని తత్ప్రాంతములుగాని యాతనికన్నుల కగపడలేదు. నావ యెక్కడనున్నదని చక్రవర్తి నావికుని బిలిచి యడిగెను. నావ గంగానదిలో నున్నదనియు సముద్రమును సమీపించె ననియు నావికుడు ప్రత్యుత్తరము చెప్పెను. "అరే బద్మాష్ నాయాజ్ఞ లేకయే నావ నడపింపుమని నీకెవ్వరు చెప్పిరిరా?

అరే నాజరుఖాన్ — అరే ఖుస్రూ. అరేనాదర్. ఉఠో రేఉఠో"
యని తన ఖడ్గము నిమిత్తమై చక్రవర్తి యట్టిట్టు చూచెను
గాని ఖడ్గమక్కడ లేకపోయెను. చక్రవర్తి పిలిచిన పిలుపులు
చెవుల సోకినతోడనే పరిజనులు త్రుళ్ళిపడిలేచి కళవళము
పడజొచ్చిరి. ఒకనితలలో మస్తు సంపూర్తిగా నుండెను
ఒకనికి నిషా సగము దిగెను. ఈవిధముగా నుండుటచే సేవ
కులు చక్రవర్తి కేవిధమైన సాహాయ్యము జేయజాలరైరి.
అప్పుడు చక్రవర్తి నిశ్చేష్టుడై యిట్టట్టుజూచి ప్రతాపరుద్రునిం
బిలిచి "యేమి యీతంత్రము. ఇదియెల్ల నీపన్నుగడయేనా"
యని యడిగెను. "ఈతంత్రకల్పనములో నాకెంతమాత్రము
సంబంధములే" దని యతడు బదులు చెప్పెను. మరి యెవరికి
సంబంధ మున్నదని చక్రవర్తి మరల నడిగెను అప్పుడు
ప్రతాపరుద్రుని ప్రక్కనున్న యేఁబది సంవత్సరములు వయసు
గల యొకానొక పురుషుడు ముందరికి వచ్చి సలాముచేసి
చక్రవర్తి కిట్లనియె. "దేవా! మీరు సెలవిచ్చిన ట్లిది యొక
మహాతంత్రమె. ఇందు బ్రతాపరుద్రున కేవిధమైన సంబం
ధము లేదు. ఇది కల్పించినవాడను నేను. నేనీ మహారాజు
మంత్రిని. ఈతని జెఱసాలనుండి విడిపించుటకై నేను బిచ్చి
వాని వేషము వేసికొని ఢిల్లీవీధులఁ దిరుగుచు మీ వేషభాషలు
మీ యాచారములు మీ వ్యవహార పద్ధతులు మీ యభి
నివేశములు గ్రహించితిని. గ్రహించి మీకు రత్నములమీఁద
మిక్కిలి యిష్టముగలదని విని యీ రతనాలయోడం దెప్పించి
మిమ్ములను బ్రతాపరుద్రుని రావించినవాఁడను నేనే. మీకుఁ
దెలియకుండ నీయోడ నడపించినవాఁడను నేనే. దేవరవారి

నిప్పు నోరుగల్లు పురమునకు ఖైదీగఁ దీసికొనిపోవ సంకల్పించుకొన్నవాఁడను నేనే. మా రాజును బంధమునుండి విడిపించి కృతకృత్యుఁడ నయినవాఁడను నేనే'' ఆపలుకులు వినునప్పటికిఁ జక్రవర్తి యొడలు జల్లుమని ''అరే అల్లాఅల్లా'' యని పాన్పుపైఁ బడెను. అది చూచి మంత్రి ''దేవా! మీరు భయపడవలదు. మీకేవిధమైన హానియుం జరుగదు. మా మహారాజును కారాగృహ విముక్తుని జేసితి మనియు ఢిల్లీచక్ర వర్తిని ఖయిదీగాఁ బట్టి తెచ్చితి మనియు సుప్రతిష్ట లోకమున సంపాదింపఁదలచి యిట్లు చేసితినిగాని మీకు హానిచేయుటకుఁ గాదు. సిగపూవు వాడకయుండ మిమ్ము మీపట్టణమునకు మరలఁ బంపించెదము. చింతలేకయుండు''డని ప్రత్యుత్తరము చెప్పెను. చక్రవర్తి విచారగ్రస్తుఁడై ప్రాణభయముచే వారు చెప్పినట్లు చేయఁజొచ్చెను. ఓడ క్రమక్రమమున సముద్రము జొచ్చి కొన్నిదినంబులకుఁ దూర్పుసముద్రతీరమున నొక రేవుపట్టణమున లంగరు వేసెను. ప్రతాపరుద్రుఁడును ఢిల్లీచక్రవర్తియు నోరుగల్లు వత్తురని మంత్రి ముందుగా నోరుగల్లునకు వర్తమానమంపెను. పురజనులు దేశస్థులు మహానంద భరితులైరి. ప్రతిగృహమున బండుగలు జేసికొనిరి పురజనులు రాజునెదుర్కొనవచ్చిరి. బంగరుహౌదాలు వేసిన రెండేనుఁగులమీఁదఁ బ్రతాపరుద్రుఁడు చక్రవర్తియుఁ గూర్చుండి యోరుగల్లు మహావైభవముతోఁ బ్రవేశించిరి. రాజకుటుంబముయొక్కయానందము దేశజనులయానందముమితిమీ

రినదని చెప్పనక్కఱలేదు కదా. చక్రవర్తిని వానికిఁ దగి నంత గౌరవము జేసి ప్రతాపరుద్రుఁడును మంత్రియు మరల నత్యంత గౌరవంబుతో నోడ నెక్కించి ఢిల్లికి బంపిరి. ఈ కార్యమును బట్టియే ప్రతాపరుద్రుని యోగ్యత వేయినోళ్ళ గొని యాడ వచ్చును. చేఁజిక్కిన శత్రువుని నెవఁడు విడిచిపుచ్చును? ప్రతాపరుద్రదేవ మహారాజువంటి యుదారపురుషునకే యది చెల్లినది. అందుచేతనే యాంధ్రభూములున్నంతకాల మామహారాజు పేరు నిలుచును.

---

## పదునాల్గవ ప్రకరణము



రామరాజు కాకతీయకులభూషణులైన గణపతిదేవుని యొక్కయు ప్రతాపరుద్రదేవునియొక్కయు సద్భుతచరిత్రలు రసములు చిప్పిలునట్లు శ్రోతలు మహానందసముద్రమున నోల లాడునట్లు కథారూపముగా వినిపింప గృహయజమానుడును నక్కడ జేరిన తక్కుంగల గ్రామవాసులును జగన్నాథదాసు మొదలగువారును విని మిక్కిలి సంతసించిరి. అప్పుడు రామరాజు గృహయజమానుని జూచి "రమారమి రెండుజాము లైనది; మీరింక నిద్రపొండు. మేము కోడికూఁతవేళ లేచి పయనమయ్యెదము. అప్పటికి మీరు గాఢనిద్రలో నుందురు. మేము మిమ్ము మరల లేపఁదలఁచుకొనలేదు. ఇప్పుడే మాకు

సెలవిం'' డని పలికెను గృహయజమానుఁ డాయనతో నిట్లనియె ''మీవాక్యమత్కారములచే జాములు నిమిషంబుల ట్లగుచున్నవి. మీరింతత్వరలో వెళ్ళిపోవుదురన్న విచారము నన్ను వదలలేదు కనుక తిరిగి వచ్చునప్పుడు మాయింటనే బసచేయవలయును. తెల్లవాఱుజామున మీరు నన్ను లేపక పోయినను నేనే లేచి మిమ్ము సాగనంపెదను. మార్గాయాసము చేత నెంతో బడలియున్న మీకు మామూలమున నిద్రాభంగము గలిగినది. కావున సుఖనిద్ర సేయుఁడు'' అని క్షత్రియ కుమారునివద్ద సెలవుగైకొని శయ్యాగారమునకరిగినిద్రించెను.

వెంకటస్వామి వేసిన పక్కమీద రామరాజు పండుకొనెను. జగన్నాధదాసు కొంతసేపు లోపలచావడిలోఁ బండుకొని ''యిక్కడ దోమ లెక్కువగాఁగుట్టుచున్నవి; నిద్రపట్టుట లేదు. రండి వీధిలోనికి బోయి యరఁగులమీదనో చెఱువుగట్టుమీదనో పండుకొందు'' మని యిద్దఱు సేవకులం దీసికొని తలుపు లోపల వేసికొమ్మని తక్కినవారితోఁ జెప్పి యవ్వలకుం బోయెను. అప్పుడు గ్రామమంతయు నిశ్శబ్దముగ నుండెను. తమోగుణముచేత నావహింపఁబడి ప్రకృతియే మహానిద్రలో బడినట్లు కానఁబడెను. అటు లొకజాము గడచెను. అప్పుడే జాముకోడి కుక్కుఠోయని కూసెను, గృహయజమానుని కూఁతురు మూఁడేండ్లవయసుగలది, నిద్రమేల్కనినల్లులుకుట్టు చున్నవనియేడ్చెను. నిద్దురబద్ధకంబుచేతఁ దల్లికన్నులు దెఱచి చూడలేక ''లేదులే అమ్మా లేదు; పండుకో'' మ్మని రెండు

సారులు మెల్లమెల్లగ జోకొట్టి నిద్రావశమున మగల నోడలు మఱచి గుఱ్ఱుపట్టెను. బాలిక మాత్ర మేడుపు మానలేదు. వచ్చియు రాని మెలకువతోఁ దల్లి "పండుకో! అబ్బా రేపు వేడినీరు పోసి నల్లులం జంపెదలే"యని బిడ్డ నొకసారి యోదార్చుచు వెంటనే నిద్రించుచు గొన్నినిమిషములు కాలక్షేపము చేసెను. అంతట యజమానుఁడు మేల్కని "పిల్ల నల్లులు కుట్టుచున్నదని యేడ్చుచుండగా నెంతమాత్రము లెక్క సేయక యట్లు నిద్రించెద వేమి? లేచి చూడు"మని కఠినముగఁ బలికి తాను కన్నులు తెఱచి చూచి "అయ్యో దీప మారిపోయినదే. చమురు సరిగాఁ బోయలేదా యేమి?" అని తన తలగడక్రింద నున్న చెకుముకి రాయియు నినుప ముక్కయుఁ దీసి యక్కడనే యున్న దూది కొంచెము బుచ్చుకొని నిప్పుజేసి దీపము వెలిగించి యిట్టటు జూచి "అయ్యో యేమిది. గదితలుపులు తీసియున్న"వని గుమ్మము కడకుఁ బోయి "అయ్యో గడపక్రింద పెద్ద కన్నమున్నదే. దొంగలుపడినారు. దొంగలు దొంగ"లని కేక వేసెను. ఆ కేక వినఁగానే భార్య యదరిపడి లేచి "అయ్యో అయ్యో అయ్యో నగలపెట్టె నగలపెట్టె" యని పిచ్చిదానివలె నఱవఁజొచ్చెను. ఈ కేకలు విని "అయ్యో అయ్యో" యని యింటిలోనివారు గదిజొచ్చిరి. ఏమివస్తువులు పోయినవో చూడండి చూడండి యని యొకఁడు, దెబ్బలు తగుల లేదు కదా యని యొకఁడు, దొడ్డివెదకండి యని యొకఁడు ఈపాటికే పారిపోవునుగాని నీనిమిత్తమై దొడ్డిలో నుండునాయని

యొకఁడు, నెవరికిఁ దోఁచినట్లు వారాడజొచ్చిరి. నానగల సంచిపెట్టె యిక్కడ లేదని యజమానుని భార్య పలికెను. ఏమేమినగ లందులో నున్నవని యజమానుఁ డడిగెను. మొహరీలపేరు, మిరియాలపేరు, చంద్రహారము, నొడ్డాణము దానిలోఁ బెట్టితిని. నిన్నసాయంకాలము తలయంటిపోసికొని నగలు దానిలోఁ బెట్టి మఱచి నిద్రించితిని. నాయొంటి కావస్తువులు పెట్టుకొను యోగము లేదు, పట్టుమని పదినెల లైన మొహరీల పేరు మెడలో వేసికొనలేదు. రంగమ్మత్తయ్య యొడ్డాణమువంటి యొడ్డాణము చేయించుకొనవలెనని యెన్నాళ్ళో మనసుపడి చేయించుకొన్నాను. మనసుపడినన్నాళ్ళు పట్టలేదు. నగలిందులోఁ బెట్టుచున్నపుడు దాసీముండ తుమ్మిందమ్మా; ప్రతిదానికి తుమ్ముపాటి చేయనాయని పెట్టెలోఁ బెట్టితిని. దీని తుమ్ములు తగులఁబెట్ట; దానికెప్పుడు తుమ్ములే. మాయబుద్ధి నాకు బోషాణములోఁ బెట్టుకోవాలని తోఁచినదికాదు. అయ్యో! నాలక్ష్మి నాయింట నుండి లేచిపోయినదమ్మా. మూసివాయినము పేరంటాలు లాగ కట్టుగుడ్డలతో 'నిలుచుండవలసిన యోగము పట్టిన'' దని పెద్దపెట్టున నేడ్చెను. ''ఏడ్చినంతమాత్రమున నీనగలు రావు. లేనిపోని యల్లరిపెట్టి యేడ్వవద్దు. ప్రాప్తమున్న పక్షమున నీనగలు నీకు మరల వచ్చును. లేకపోయిన పక్షమున నేను మరల జేయించిపెట్టెదను''అని గృహయజమాను డోదార్చెను. రామరాజునకుఁ ముందుగనె మెలకువవచ్చెను. గాని స్త్రీలున్నారని సందేహించి యతఁడు లోనికిరాక కచ్చేరీ

చావడిలో నిట్టటుఁ దిరుగుచుండెను. ఈగడబిడ వినఁగానె జగన్నాథదాసు సేవకులు తలుపులు తీయించుకొని లోనికి వచ్చి దొంగతనము జరిగినందుకు మిక్కిలి యాశ్చర్యము నొందఁజొచ్చిరి. ఇంటిసేవకులందఱు దొడ్డి నాలుగుమూలలఁ జూచిరి. దొంగలు దొరకలేదు. నగ లంతకన్నదొరకలేదు. కాని నగలపెట్టెమాత్రము గృహము వెనుకనున్న కూరల దొడ్డిలో దానిమ్మచెట్టుక్రిందఁ బగులఁగొట్టబడి కానఁబడెను. యజమానునిభార్య యాపెట్టెజూచి మరల రాగముపెట్టెను. యజమానుఁ డంతట వీధిచావడిలోనికి వచ్చెను. రామరాజు వానినిజూచి "నాకు మిక్కిలి విచారముగానున్నది. దీని కేవిధమైన ప్రతిక్రియయులేదు. మనము ప్రొద్దుపోవువఱకు మేలుకొని యుండుటచే గాఢనిద్ర జెందితిమి. అందుచేత మెల కువ వచ్చినదికాదు. మీయింట సొమ్ముపోయినందు కొక విచారము. మేముండగా నిట్టిపని జరిగినందు కొక విచారము నన్ను వేధించుచున్నది" అని తన విషాదము నెఱిఁగించెను. జగన్నాథదాసు తన మనోవిచారముఁ గూడ నెఱిఁగింపఁ దలఁచి యిట్లనియె "మేమిక్కడనుండగా నిట్టిపని జరుగుట నాకు శిరచ్ఛేదము జరిగినట్లున్నది. దోమలబాధచే నేనావ లకుఁ బోయి నిద్రించితినిగాని యిక్కడ పండుకొన్న పక్ష మున నాకు మెలఁకువ వచ్చితీరును. దొంగలబుద్ధి లీపాటికి గొబ్బరిపుచ్చెనవలె నెగిరిపోయి యుండును. ఏమికార్యము! నాకు మాట దక్కునట్టి యోగములేదు" అప్పుడు గృహ

యజమానుఁడు "నాయదృష్టమునకు మీరేమి చేయఁగలరు? మీరీ విషయమై విషాదపడవద్దు. ఇందువలన మీప్రయాణమునకు భంగము గలిగించుకొనవద్దు. తొందరపని గావున మీరు దయచేయుఁడు మరల వచ్చునపుడు తప్పక మీరు రావలయు" నని చెప్పెను. అంతట రామరాజు ప్రముఖులు పయనమై యిల్లు వెడలిరి.

---

## పదిరెండవ ప్రకరణము

రామరాజు జగన్నాథదాసు మొదలగువారితో గలిసి పయనము సేయఁజొచ్చెను. కాని యతనికి మునుపటివలె మార్గమధ్యమందుఁ గూడ కథలుచెప్పుట కుత్సాహములేక పోయెను. గడచినరాత్రి తాను బసదిగినయింట జరిగిన దొంగతనమే యాతని మనస్సునఁ బ్రధానవిషయమై యుండెను. తాను వినోదములగు కథలు చెప్పి రెండుజాముల రాత్రివఱకు గృహయజమానుని మేల్కొనఁబెట్టుటచే నిద్రాభారమున నతఁడు దొంగతనము జరుగుచున్నను మేల్కొనలేకపోయెననియు నందుచేత నాతనికిఁగలిగిన నష్టమునకుదానె కారణమనియుఁ దానుండఁగ నక్కడ చౌర్యము జరుగుట తన కప్రతిష్టాకర మనియుఁ దలంచి విచారింపఁ దొడంగెను. జగన్నాథదాసు రామరాజు గుఱ్ఱమువద్దకుఁ దన గుఱ్ఱమును

దీసికొనివచ్చి యేదో యొక కథ చెప్పవలసినదని వేఁడుకొని యెను. గాని రామరాజు "నేఁడెందుచేతనో నామనసు సరిగ లేదు. కావున కథ చెప్పఁజాల"నని బదులుచెప్పెను. అట్లు పయనము చేసిచేసి వారు పగలొకగ్రామమందు విడసి యచ్చట భోజనముచేసి సాయంకాలము మఱియొక గ్రామమునకుఁ జనిరి. ఆనాఁడు విశేషంబు లెవ్వియు జరుగలేదు. జగన్నాథదాసు రాత్రి కథ యేదేని జెప్పుమని ప్రార్థించెను. కాని యతఁడు కన్నులు మూసికొని నిద్రవచ్చుచున్నది, చెప్పజాలననుచు గుఱ్ఱుపెట్టి నిద్రపోయెను. తెల్లవాఱుజామున మరల నాబాటసారులందఱు లేచి పయన మారంభించిరి. ఈసాయంకాలము కొండపల్లె తప్పక చేరుదమని వెంకటస్వామి యానాఁటి యుదయమునఁ బలుమారులనెను. బయలుదేఱి కొంతదూరము పోయిన తరువాత నొనఁగా సూర్యోదయమైన యొక గడియకు జగన్నాథదాసు రామరాజుతో నిట్లనియె— "రాజుగారూ! మనమీ సాయంకాలమునకుఁ గొండపల్లెగ్రామము చేరఁగలము కాని కొండపల్లె కిక్కడ నుండి రెండు దారులున్నవి. అందు మొదటిది మనము నడచుచున్న రాజబాట. రెండవది యడ్డదారి. ఈరాచబాటనుబడి మనము పయనము చేసితిమేని రాత్రి జాములోపుగఁ గొండపల్లె జేరలేము. అడ్డదారిని బోయితిమా నాలుగుగడియల ప్రొద్దువేళకో లేక సూర్యాస్తమయ సమయమునకో గమ్యస్థానము జేరఁగలము. రాత్రిపడిన తరువాత నీప్రాంతములు

మనవంటివారికి నడవఁదగినవి గావు. ఈప్రదేశములు దారులు కొట్టు దొంగల కునికిపట్లు. అందుచే చీఁకటిపడకుండ మనము గ్రామము జేరఁదలఁచితిమా యడ్డదారిం బోవలయును. లేదా సాయంకాలమున కేగ్రామము చేరుదుమో యా గ్రామమునఁ బయనమాపి బసదిగి రేపుదయమునఁ గొండపల్లె జేరవలయు. ఈవఱకే మీరు మార్గాయాసముచేత మిక్కిలి డస్సి యున్నారు. ఇటువంటి ప్రయాణము లెన్నఁడు మీరు జేసిన వారు కారు. అదియునుఁ గాక మీమేనమామగారికి జబ్బుగా నున్నదనికదా మీరు వెళ్ళుచున్నారు. ఒక్క పూటయేని యాలస్యము జేయక యెంత తొందరగా వెళ్ళిన నంతమంచిది. కాబట్టి యడ్డుదారిని వెళ్ళుటకు సమ్మతింపవలయునని కోరుచున్నాను'' ఆపలుకులు విని రామరాజు తన గుఱ్ఱము నాఁపి దారి యెట్లుండును? గుఱ్ఱముతో బయనము చేయుటకు వీలుగానుండునా యని యడిగెను. ''అక్కడక్కడ దారి మెరకపల్లములుగా నుండును. కొన్నిచోట్లచిన్నకొండలున్నవి. అవి దాఁటుట యంతకష్టముకాదు. దారి దుర్గమమైనచో నేను మాత్రము మిమ్ము రమ్మందునా?' యని జగన్నాథదాసు ప్రత్యుత్తరమిచ్చెను. ఆయుత్తరము విని మేనమామ జబ్బుగా నుండుటచే నాతని నెంతవేగముగాఁ జూచిన నంత మంచిదను కొని రామరాజు రాచబాట విడిచి యడ్డుదారింబోవ నిశ్చయించుకొని కళ్ళెము ప్రక్కకుద్రిప్పి గుఱ్ఱమునడ్డదారిం ద్రిప్పెను. జగన్నాథదాసుయొక్కయు వాని పరిచారుల

యొక్కయు గుఱ్ఱములు ముందు నడువసాగెను. రామరాజు గుఱ్ఱము వానివెనుక నడచెను బోనముపెట్టె తలపైఁ బెట్టుకొని వెంకటస్వామి చెక్కుచెదరక యెవ్వరితో మాటలాడక శిరసుపైఁ గిరీటము బెట్టుకొని నడచుచున్న శిలావిగ్రహమో యన్నట్లు యజమానుని వెంటనంటి పయనము చేయుచుండెను. ఆమార్గమును బట్టి కొంతదవ్వరుగు నప్పటికి రామరాజు మనసున ననేక సందేహములు తోచెను. "ఏమిది మాగుంపు తప్ప మనుష్యుఁ డెవఁడు నీదారిని నడచుటలేదు. దారియు మనుష్యులు నడచినదిగ నడవదగినదిగఁ గనఁబడుటలేదు. మిరకలు పల్లములు ముండ్లడొంకలు పొదలు గుట్టలు మెట్టలు గల యీమార్గము మనుష్యుఁడు కాలినడకను బోవుటకు వీలులేదని చెప్పవచ్చును. అట్టియెడ గుఱ్ఱముతో నెట్లు పయనము సేయనగును? అయినను నేనొక్కఁడనే కానుగదా నాతోడిపాటుగ మఱికొందఱు కలరుగదా. వీరెవ్వరై యుందురు. ఎఱుఁగక యీ దారింబడిరా. ఎఱిఁగియుండి నన్నువంచించుటకై యీ మాయోపాయము గల్పించిరా? అయినను వీరు నన్నేమి చేయఁగలరు. ధనమా విశేషము నావద్దలేదు. ధైర్యధనమా వీరుదోఁచుకొనలేరు కాని నా ప్రాణములకంటె నెక్కుడు ప్రియమైన యీ గుఱ్ఱము మాత్రము కష్టపడుచున్నదని విచారముగ నున్నది" అని తనలోఁ దాననుకొని గుఱ్ఱమును మిక్కిలి జాగరూకతతో నడుపుచు

వెంకటస్వామిని హెచ్చరించుచు రామరాజు పయనము చేసెను. మధ్యాహ్నమగునప్పటికి వారొక త్రాటితోట జేరి యక్కడనే వండుకొని భుజియించి మరల బయనమై నడువసాగిరి.

---

## పదమూఁడవ ప్రకరణము

రామరాజు మనస్సునం బొడమిన సందేహము లంత కంతకు హెచ్చఁజొచ్చెను. వెనుకకు మరలిపోవలయునన్న నతనికాదారి తెలియదు. ముందుకు సాగిపోవలయునన్న జగన్నాథదాసుమీఁద నమ్మకము తగ్గఁజొచ్చెను. పాపము జగన్నాథదాసు మంచి యుద్దేశముతోఁ దన్ను నెంటఁబెట్టుకొని పోవుచున్నాఁడేమోయని సందియము నడుమ నడుమ పడజొచ్చెను. అందుచేత నతండు మనోనిశ్చయము లేకయే గుఱ్ఱము తీసికొని వెళ్ళినదారిని వెళ్ళజొచ్చెను. అట్లు వెళ్ళుచుండ వెనుక నడచుచున్న వెంకటస్వామి "అమ్మా" యని కేక వేసి బోనముపెట్టె నేలఁబెట్టి చదికిలంబడెను. అది విని రామరాజు వెనుకకుం దిరిగిచూచి గుఱ్ఱమాపి క్రిందికి దిగెను. ఆ ధ్వనివిని రామరాజు దిగుట గని జగన్నాథదాసు వాని యనుచరులు గుఱ్ఱములనాఁపి దిగి వెంకటస్వామి వద్దకు వచ్చిరి. రామరాజు సేవకునికడకుఁ బోయి నేలఁ జతికిలం బడుటకుఁ గారణమేమియని యడుఁగగా "బాబూనా కాలిలోఁ బెద్దముల్లు

విరిగినది. ఇదిగో నెత్తురు వచ్చుచున్నది. అని వెంకటస్వామి యేడ్చెను. భయములేదు. ముల్లు విరిగినంతమాత్రముననే యేడ్చెదవేమి యని రామరాజు వానికి ధైర్యము చెప్పెను. జగన్నాథదాసు ననుచరులలో నొకడు ముల్లూడబెఱికెను. ముల్లూడినను కాలునడక కనుకూలముగా లేకపోవుటంజేసి వాని నెట్లు పయనము సేయింపఁదగునని రామరాజు దాసు నడిగెను. "ఏమిచేయఁగలము. ఎట్లో కుంటుకొనుచు మెల్ల మెల్లగా నడచి రమ్మని చెప్పుదము. అంతకంటె మనమిప్పుడు చేయవలసిన దేమున్నది" యని దాసు ప్రత్యుత్తరమిచ్చెను. "కటకటా! నెత్తురోడుచున్న కాలితో వానిని నేను నడువు మని చెప్పఁగలనా" యని రామరాజు పలుక "నట్లయిన నేమిచేయుదువు. ఈరాత్రి వాని నీచెట్లక్రిందఁ బండుకొమ్మని చెప్పుము. రేపుదయమున మనమువచ్చి తీసికొనిపోవుదము. ఎదుర రెండుక్రోసుల దూరములో నొకపల్లెయున్నది నడిమి కావడివేసి తీసికొనిరావలసినదని యక్కడనుండి మనుష్యు లను బంపుదము" అని దాసు మరల బదులు చెప్పెను. "ఏమీ! దిక్కులేని యీ సేవకుని నొంటిగ నిర్జనమైన యీ యడవిలో విడిచి వెళ్ళుదునా? అట్లున్నఁడు నేను జేయఁ జాలను. వెంకటస్వామీ! లే" యని లేవఁదీసి గుఱ్ఱమెక్కు మని యాజ్ఞాపించెను. వెంకటస్వామి వినయభయసంభ్రమం బులతోఁ జేతులు జోడించుకొని నిలువంబడి "బాబయ్య గారూ! అంతపని నేను జేయలేను. నేనీ రాత్రి యీ చెట్ల క్రింద నుండెదను. రేపు నడికావడిమీఁద వచ్చెదను. తమరే

యెక్కుండి''యని విన్నవించెను. దయాగస శీతలమైన రామ రాజహృదయముమీఁద వెంకటస్వామి వేఁడికోలు పనిచేయ లేదు. రామరాజు వానిని చేయిపట్టుకొని గుఱ్ఱమెక్కించెను. రామరాజుయొక్క మహోదారశీలమునకు జగన్నాథదాస ప్రముఖులు మిక్కిలి నాశ్చర్యము నొందిరి. రామరాజు వెంకటస్వామిని నశ్వము నెక్కించి బోనముపెట్టె వాని వెనుక గుఱ్ఱముమీఁదఁ బెట్టి పడిపోకుండ త్రాళ్ళతోఁగట్టి గుఱ్ఱమును నడచునట్లు హెచ్చరించి కళ్ళెమును వెంకటస్వామి చేతి కిచ్చి తాను వానిప్రక్క నడువఁజొచ్చెను. జగన్నాథ దాసున కిది జన్మమధ్యమునఁ జూడనివింతగదోఁచెను వెంకట స్వామి మున్నెన్నఁడు గుఱ్ఱమెక్కనవాఁడు కాకపోవుటచే సరిగా దానిని నడిపింపఁజాలక పోయెను. అట్టి సమయము లందు రామరాజే వానికి గురువై యశ్వగమన విశేషంబులఁ గ్రొత్తగా నేర్పెను. అగర్భశ్రీమంతుడై కాలుక్రిందఁబెట్టి నడచి యెఱుఁగని యజమానుఁడు నడచుటయు, నడకయే కాని వాహనమెన్నఁడు నెక్కియెఱుఁగని తాను గుఱ్ఱ మెక్కుటయుఁ దలంచుకొని వెంకటస్వామి మితిమీరిన సిగ్గుజెంది గుఱ్ఱముమీఁద దలవంచుకొని కూరుచుండెను. వెంకటస్వామిగుఱ్ఱము మెల్లగ నడవఁజొచ్చెను. దాసు మొదలగు వారిహయములు వేగముగ నడచుటంజేసి చాల దూరమున నుండెను. సూర్యాస్తమయ మగునప్పటి కా మార్గస్థులందఱు నొకపల్లె జేరిరి. అది తన మేనమామ యున్న కొండపల్లెయేయని రామరాజు సంతసించి

యొకటిరెండుసారులు వెంకటస్వామితో "అదిగో మామయ్య గారి యూరు సమీపించినాము. నీకాలికి మందు వేయించెదను. భయపడకు" మని ధైర్యము చెప్పెను. ఆగ్రామము రామ రాజనుకొన్న కొండపల్లె కాదు. కొండలలోనున్న యొక పల్లె గ్రామము చేరఁగానే యిదియేనా కొండపల్లెయని యతఁడు జగన్నాథదాసు నడిగెను. "ఇది కొండపల్లెగాదు. ఇక్కడికి రెండుక్రోసులదూరములోనున్నది కొండపల్లె. రేపుదయమున మన మాయూరు చేరఁగలము. ఈరాత్రి మనమిక్కడ విశ్ర మింతము ఇక్కడ నేనెఱిఁగినవారు చాలమంది గలరు" అని యతఁడు బదులుచెప్పెను. "ఈరాత్రి తప్పక కొండపల్లె చేర గలమని నీవు నమ్మఁబలికినందున రాచబాట విడిచినీవెంట నీదారినివచ్చితిమి. నాగుఱ్ఱమా యలసిపోయినది నా సేవకుని కాలికా గాయము తగిలినది. నాకోరికా నెరవేరలేదు. ఏల యిట్లు చేసితి"వని యొక్కింత కఠినస్వరముతో రామరాజు పలికెను. "అయ్యా! కోపపడకండి. ఇందు నాలోపము విశే షములేదు. మీ గుఱ్ఱ మీదారిని సరిగా నడిచినదిగాదు. మీసేవకుఁడు గాయపడుటవల్ల మీగుఱ్ఱ మడుగులు లెక్క పెట్టుకొనుచు నడచినది. మీనిమిత్తము మేము కనిపెట్టుకొని యుండుటచే నందఱ కాలస్యమయిన" దని యతఁడు త్తరము చెప్పెను. "సరే కాని" యని కోపదృష్టితో రామరాజు బదులుచెప్పి వెంకటస్వామిని గుఱ్ఱముమీదనుంచి దింపి యొక యరుగుమీఁద గూర్చుండఁబెట్టి బోనముపెట్టి దింపి వాని

ప్రక్కను బెట్టి యశ్వమును దానె స్వయముగ నొకచెట్టు నకుఁ గట్టిపెట్టెను. జగన్నాథదాసును రామరాజును నాపల్లె లో నున్నవారందఱు జూడవచ్చిరి. దాసు రామరాజు నొక పెంకుటింటికిఁ దీసికొనిపోయి చావడిలో నొకబల్లమీఁదఁ గూర్చుండఁ బెట్టెను. అనంతర మక్కడకు వెంకటస్వామి భోనము పెట్టె సహితముగా వచ్చెను. రామరాజునకు జగన్నా థదాసు భోజనసదుపాయమును జేసి గుఱ్ఱమునకు మేఁత వేయించి వెంకటస్వామి కాలికిఁ కట్టుకట్టించి యొకగదిలో రామరాజునకు మంచము పక్క వేయించి పండుకొనఁబెట్టెను. భోనముపెట్టె తనమంచమువద్ద పెట్టవలసినదని రామరా జాజ్ఞాపించెను. అది యట్లె జరిగెను. రామరాజు మార్గాయా సముచేతఁ బగలెల్ల నలసినను నతనికిఁ బండుకొనఁగానే నిదుర రాలేదు. అతని మనస్సున నెన్నెన్నో తలంపులు పుట్టి యుడుఁగు చువచ్చెను.

---

## పదినాల్గవ ప్రకరణము

నిద్దురపట్టకపోవుటచే రామరాజులేచి మంచముమీఁద గూర్చుండి దృష్టి పైకి నిగిడ్చి తనలో నిట్లని తలంచెను— "ఏమిది? ఇక్కడ మహామాయ జరుగుచున్నట్లు తోఁచు చున్నది. ఈపల్లియలో నై చిత్ర్యమేమొకాని నాగరికుఁడొక్క డును గానరాఁడు. ఒక మనుష్యుఁడైనను నమ్మఁదగిన పెద్ద

మనుష్యునివలెఁ గానఁబడఁడు. ఈ మనుష్యుల యాకారములు వాలకములు చూడఁజూడ గజదొంగల విధమున నొకగపడు చున్నారు. ఇది దొంగల గూడెమేమో యని సందేహము తోఁచుచున్నది. గ్రామమైనచో బ్రాహ్మణులు గాని క్షత్రియులు గాని వైశ్యులుగాని లేక యుందురా? దొంగలగూడె మగునా కాదా యని సందేహింపనక్కఱలేదు. నిశ్చయముగా నల్లె అట్లయిన వీరి బారినుండి తప్పించుకొనుట యెట్లు'' అని మరియేమేమో తలంచుకొనబోవుచుండ యమకింకరులవంటి నలుగురు మనుష్యులు విసవిసవచ్చి గదిలోఁ బ్రవేశించిరి. వారిం జూచి రామరాజు చివాలున మంచముమీఁదనుంచి లేచి ప్రక్కనున్న ఖడ్గముమీఁదఁ జేయి వేయఁబోవుచుండ వచ్చిన వారిలో నిద్దఱు గుభాలున వానిపయింబడి పట్టుకొనిరి. మూఁడవవాఁడు చేతిలోనిఖడ్గము లాగివేసెను. అప్పుడు పైబడి పట్టుకొన్న వారిలో నొకఁడు వానిచేతులు రెండును వెనుకకు విఱిచికట్టెను. నాల్గవవాఁడు మంచము నడుమెక్కి కూర్చుండెను. ఇది యంతయు రామరాజు మాటాడుటకునైన వ్యవధానము లేనట్లు నొక్కనిమిషములో జరిగెను. తక్కిన ముగ్గురు రామరాజును మంచముమీఁదఁ గూర్చున్నవాని కెట్టయెదుట నిలువంబెట్టిరి. మంచము నడుమెక్కిన మను ష్యుఁడు దొంగల దొరయగు కొండ గంగులని రామరా జెఱుఁగక పోయినను మా చదువరులకుఁ దెలియకపోదు. ఆ ప్రముచ్చుల దొరమంచపు గద్దెపైఁ గూర్చుండి ముజ్జగంబులు

దొరయగు దేవేంద్రునకు నైన లేనంత తీవి యహంకారము క్రౌర్యము వహించి కోరచూపుల రామరాజుం జూచి యిట్లనియె. "ఓ చిన్నవాఁడా! నీకొకమాట చెప్పుచున్నాను విను. నీవు మాచేతులలో బడినావు బ్రతికియుండవలెనంటే ఒకటే మాట. ముందుగా నీదగ్గరనున్న సొమ్మిచ్చి తరువాత మేము కోరినంత ధనము నీవీయవలసినదే. ఈయకపోతే నీబుఱ్ఱ ముంజికాయలాగున నెగిరిపోవును. మంచిచెడ్డ లాలోచించుకొని చెప్పినట్లు చేసి ప్రాణములు దక్కించుకో. నేనెవరనో నీకెరుకలేదు కాఁబోలు! నాపేరు కొండగంగులు కొండగంగుల పేరు చెప్పితే పాములు పరుగెత్తవు పక్షులు మేత మేయవు; పులులు నీళ్ళుత్రాగవు. నేను యమధర్మరాజునంటే యమధర్మరాజువంటి వాళ్ళపుఱ్ఱెలు బొబ్బరిపుచ్చెల లాగున నరికివేయించెదను." ఆమాటలు చెప్పునప్పుడు కొండగంగులు ముఖవైఖరి యతని యభినయము చూచితీరవలయుఁ గాని వర్ణింప నలవికాదు. అప్పలుకులు విని రామారా జిట్లనియె "నీప్రచురము నేను వినలేదు. కాని నీమాటలఁ బట్టియు నీవాలకమును బట్టియు నాకుఁ దెలియుచున్నది. నాఖడ్గము నాచేతఁ జిక్కినపక్షమున నేను నీస్థితిలోను, నీవు నాకంటె దీనమైన స్థితిలోను నుండుట సంభవించియుండును. మీ యదృష్టము చేత నా ఖడ్గము నాచేతఁ జిక్కకపోవుటయుఁ తత్కారణముగ నను మీయధీనమగుటయు సంభవించినది. మీరు నన్నుజంపుదురని నా కెంతమాత్రమును భయములేదు. జన్మమెత్తిన

తరువాత నెప్పుడైనను జావకపోము కాని నామేనమామకు జబ్బుగానున్నది. ఆయనను జూడవలయునని నేను మిక్కిలి త్వరపడుచున్నాను. నాభోనముపెట్టెలో నూరువరహాలున్నవి. అవి మీరు పుచ్చుకొని నన్ను వదలివేయుడు. మేనమామయందలి ప్రేమాతిశయముచేత నేనిట్లనుచుంటిని గాని ప్రాణభీతిచేతఁగాదు. ఈబోనముపెట్టెయందులోనున్న వస్తువులు తప్ప నావద్ద నితరమైన సొత్తులేదనినన్ను, వంచించి మీకడకుఁ దీసికొనివచ్చిన నీగులాము జగన్నాధదాసు నిశ్చయముగ నెఱుఁగును.'' అనవుడు గంగులు''వోరే జోగులూ బోనముపెట్టె తీయరా!'' యని పెట్టెతీయించి యొక లక్కబరిణలోనున్న నూఱువరహాలం దీసికొని మరేమయిన ధనమున్నదేమోయని పెట్టె రెండుసార్లు వెదకించి యందులోనున్న జరీబట్టలు కొన్నిటిని గ్రహించి కొండపల్లె కాగితముల పుస్తకములను దాటియాకుల పుస్తకములును దీసి నట్టిటు పారవైచి కొంతసేపేమేమో యాలోచించి యవ్వల నిట్లనియె. ''చిన్నవాఁడా! ఈ నూరువరహాలు మాకుచాలవు. మరి వేయివరహాలు మాకిచ్చినపక్షమున నిన్ను విడిచిపెట్టెదము. అంతవరకు నిన్ను వదలము. సొమ్మిచ్చువరకు నీవు మాఖయిదీగా నుండవలసినదే'' ఆమాటలువిని రామరాజు ''నావద్ద ధనములేదేమి చేయుమనియెద'' వని యడిగెను. ''నీవద్దనున్న నౌఖరును మీయింటికిఁ బంపించి వానిచేత ధనము దెప్పించి నాకీయవలయును.'' అని గంగులు బదులు చెప్పెను. అది వినగానే రామరాజునకు మనోధైర్యము మిక్కుటముగాఁ

బోడమెను కొలఁదికాలములోనె తనకు విముక్తి గాఁగలదనియు గంగులునకు వానితోడి దొంగలకు వినాశకాల మాసన్నమైన దనియు నతని మనంబునం దట్లను దట్టినతోడనే యాతఁ డిట్లనియె. "నా వెంట వెంకటస్వామియను కావలికుఱ్ఱవాఁడు వచ్చియున్నాఁడు. మీయిష్టమైన యెడల మాతండ్రి పేర జాబువ్రాసి వానిని బంపి సొమ్ము తెప్పించెదను." అనవుడు గంగులు వాని కేదో గాయము తగిలినదట కాదూ అది కుదర గానే పంపవచ్చును. కాని మమ్ము సంహరించుటకై నీవే మాత్రము ప్రయత్నించినను మీతండ్రి లష్కరు గిష్కరు దీసుకువచ్చినను ముందుగా నీప్రాణములు తీసివేసెదము కపర్దార్. ఈసంగతి నీజాబులో వ్రాయవలెను. లేనిచో మీతండ్రి గోలుకొండనుండి యొకసేన తీసికొని రాఁగలఁడు నీవెన్నఁడు మాప్రాణములు తీయనని యట్టివారికి సహాయము జేయనని యొట్టు పెట్టుకొనుము. లేనిచో నీవు డబ్బిచ్చినను నిన్ను బ్రతుకనీయము" అని పలికెను. అనవుడు రామరా జొక్కింత యాలోచించి యాప్రమాణముయొక్క మంచి చెడ్డలు విమర్శించి వారు చెప్పిన చొప్పున నొట్టుబెట్టుకొనెను.

---

## పదియేనవ ప్రకరణము

"ఓసీ! నిన్నరాత్రి యేదో కలవరము పుట్టినట్టు తోఁచి నది అది యేమో నీవెఱుఁగుదువా? జాముర్రాత్రివేళ

గంగులు, జగన్నాథదాసు మొదలగువారు చేరి గుసగుసలాడు కొనజొచ్చిరి. అలాగున చేయుదమని యొకఁడు నీలాగున చేయుదమని యొకఁడు తోఁచిన విధముగ గంగులుతో నాలోచన చెప్పసాగిరి. గొప్పచేప యేదైన వలలోఁ బడి నదా యేమి? చూడఁజూడ సంపన్నుఁడో పాతఁశత్రువో యీగజదొంగలచేతఁ జిక్కినట్లు తోఁచుచున్నది. పాప మెవని దినములు బాగున్నవి కావో కద! ఎవని తలిదండ్రులు పుత్రశోకముచేఁ దల్లడిల్లుదురో కదా. ఎవనినామమునందలి యక్షరముల యమధర్మరాజు గుణించుచున్నాఁడో కదా. ఈ బెబ్బులి గుహఁ బ్రవేశించిన మేఁకపోతు లెన్నఁడైనఁ మరల ప్రాణములతో నవలకు వెళ్ళినవా? నిజముగా నెవరో వీరిచే మార్గమధ్యమునఁ బట్టువడి యుండిరని నేను దలంచెదను. రెండుజాములు రాత్రివేళ నాకు మెలకువవచ్చినపుడు గంగులు మొదలగువారు తెగఁద్రాగి పాటలు పాడుచుండిరి. అందుచే నేనిట్లనుకొంటిని'' అని యొకయంగన తన పరిచారికతో నెంతో యాత్రముతోఁ బలికెను. పలుకుటయు నప్పరిచారిక కన్నుల నీరుదెచ్చుకొని యయ్యంగనతో బుగ్గను చేయిబెట్టు కొని యిట్లనియె— ''అమ్మా! ఏమి చెప్పుదును తల్లీ నిన్న గూట దీపములు పెట్టగానే యెవరినో జగన్నాథదాసు తీసు కొనివచ్చినాడు ఆయనను గదిలోఁ బ్రవేశపెట్టినాఁడు నాతల్లీ! ఆయన నేమి చేయుదలచుకొన్నారో కాని, ఆయన తల్లి పుణ్యము తండ్రిపుణ్యము నెట్లున్నదో కాని నారాయణ మూర్తి యాయనమోమున నేమివ్రాసిపెట్టినాఁడో కాని

చక్కని చుక్కమ్మ. బంగారపు బొమ్మమ్మ చేరెడేసికండ్లు ప్రొద్దునలేచి యాయన మొగము చూచితే పాపాలు పోకమానవు చుక్కలలో చందమామ. ఈకటికవాళ్ళ చేతులలో నేలాగు పడినాడో? ఆయన కేమి మూడినదో? వీళ్ళదుంపతెగ. ఈబండదొంగ లేమి తలచుకొన్నారో నాకేమీ పాలుపోదు. ఆయనగారి పెట్టెలో నూరు వరహా లున్నవట అవి వీళ్ళు దోచుకున్నారంట. ఏదో పనిమీద నాలాగు వెళ్ళినట్లు వెళ్ళి యాయనమొగ మిట్లు చూచినా నమ్మా. పో పో నీకెందుకు పో యని కేకలు వేసినారు. భయపడి నేనుపరుగెత్తుకొని వచ్చినాను. అప్పుడే యొక తూరి మొగమువంకచూచినాను ఏమిమనిషమ్మా రాచ కొడుకేమో? ఎందుకు నాకెందుకమ్మా నన్నడుగఁబోకు'' పరిచారికపలుకు లంగనకు మునుముందు విషాదంబు గలిగించెను. అందుచే నామె యించుకసేపు లోలోన విచారించి మెల్లన నిట్లనియె. ''ఓసీ! నీవనినట్లతడు రాచకుమారుఁడే యైనపక్షమున నాకు విచారముపోయి సంతోషము వచ్చుచున్నది. ఏలయన క్షత్రియకుమారుఁడు తనపీడలందొలగించుకొని పరులపీడలం దొలఁగింపగలఁడు. మనమంత యదృష్టవంతులము కాముగాని మనమట్టికోరికలు కోరఁగూడదుగాని మనమీబంధమునుండి విముక్తులమగుటకతఁడేదేని సాయము చేయఁగూడదా'' అనపుడు నప్పరిచారిక యొక మూలనుండి మరియొక మూలకుఁ దలనుత్రిప్పి యీసడింపుచు ''ఆలు లేదు చూలు లేదు కొడుకుపేరు సోమలింగ మన్నా'' రంట నీమా

టాలాగు నున్నదమ్మా. రేపీపాటివేళప్పుడు మనదొంగ దొర లారాచకొండుకు పుత్తె నెగురఁగొట్టి దయ్యాలమఱ్ఱిచెట్టుకొమ్మకు గట్టకపోతే నాపేరు మారుపేరు పెట్టు. ఆయన జీవనమాయన కాపాడుకుంటే నిన్నూ నన్నూ రక్షించినంతఫలం. ఆయనేమిటి, మనకు సాయముజేయుటేమిటి ? చాలుచాలు ! చిన్నపిల్లవు. నేను చిన్నప్పుడనఁగా బుట్టినాను; నాకన్న నెక్కువ తెలుసునా నీకు'' అని మందలించుటయు నయ్యంగన చిఱునవ్వునవ్వి మఱియేమో చెప్పబోవుచుండ నంతలో గదలివచ్చుచున్న తాటిచెట్టువలె గంగులు, మఱియిద్దఱు మనుష్యులతో నక్కడకు వచ్చెను. చిరపరిచితుడైనను వానిని జూడఁగానె యయ్యంగనను బరిచారికను నొడలువడఁకెను. తమమాటలేమైన నతఁడు విని తమ్ము దండించుటకు వచ్చెనేమో యని పరిచారిక చలిచే వడఁకినట్లు వడకజొచ్చె. అప్పుడు గంగులు వారిని జూచి ''భయపడవద్దు. పండ్రెండు సంవత్సరములనుండి యున్నవారికిఁ గూడ భయమేనా ?'' యని ధైర్యముచెప్పెను. అప్పుడు తమమాటలు విని యతడు రాలేదని పరిచారిక ధైర్యము దెచ్చుకొనియెను. అంతలో నిరువురు మనుష్యులు రామరాజు నక్కడకుఁ గొనితెచ్చిరి. అతని చేతులు వెనుకకు పిఱిచి కట్టబడలేదు. కడచినరాత్రి ప్రమాణములు చేసినతోడనే గంగులు వాని చేతికట్టులు విప్పించి భగవంతుఁడిచ్చిన యవయవములను స్వేచ్ఛగఁ గదుపవీలు కలుగఁజేసెను. అతఁడు వచ్చి తన్ను దోడ్కొని వచ్చిన సేవకులనడుమ నిలిచి మెట్టయెదుట నిలిచియున్న

యాయంగనను దేరిపారచూచెను. ఆయంగనయు రాజకుమారుని సుందరముఖారవిందము దలవంచికొని క్రేగంటిచూపులఁ జూచెను. భాగ్యవంతులపైఁబడి శరీరమందలి సమస్తాభరణములం దోఁచికొను గజదొంగవలెనే రామరాజుయొక్క విశాలనేత్రములు తన యెట్టయెదుట బంగారు బొమ్మవలె నిలిచియున్న యాయంగన ముఖము పైబడి లావణ్యాతారుణ్యంబులఁ జూరలాడఁదలచి యవి యపహరించుటకు వీలుకాని యాభరణములగుటచే వాటిని స్పృశించుచు నక్కడనే నిలిచియుండెను. తాఁజెడ్డకోతి వనమెల్ల జెఱచెనన్నట్లు చంచలములగు నాతని కన్నులు రాచకుమారుని మనస్సును గూడ దీసికొనిపోయి యామె మీఁద నిలిపెను. సిగ్గున దల యెత్తి చూచుటకు వీలులేకపోయిన నయ్యంగనయుఁ గటాక్షవీక్షణముచేతనె రాచకుమారుని చక్కదనముజూచి తనివిపోవక మరలమరలఁ జూచుచు నానందము నొందుచుండెను. అయువజను లీవిధమున బరస్పరావలోకన కుతూహలంబున మైమఱచియుండ వారి యానందమునకు భంగకరముగ గంగులిట్లనియె "—మాచీ! ఈరాజుల చిన్నవాఁడు కొన్నాళ్లు మనకడ నుండఁగలఁడు. నీవు వంట సున్నితముగ జేయగలవట. ఈయనకు గావలసిననంజుళ్లు పచ్చళ్ళు పిండివంటలు కాయగూరలుచేసి పెట్టవలెను. ఏలోపము జరుగగూడదు. కృష్ణవేణి! నీవుకూడ మాచికి సాయముచేసి పనిచేయవలెను. జాగ్రత్త! జాగ్రత్త! అనవ్వుడు మాచి "మంచిదిబాబూ

మంచిది బాబూ అలాగే చేసిపెట్టెద" నని యుత్తరమిచ్చెను. కృష్ణవేణి యంగీకారసూచకముగఁ దల ద్రిప్పెను. అంతట గంగులు రామరాజు మొదలగు పరివారము వెంటరా నావ లకుఁ బోయెను.

---

## పదియేడవ ప్రకరణము

పల్లియ జేరినతరువాత యజమానుని మొగము వెంకట స్వామియు, సేవకుని మొగము రామరాజు నాలుగుదినముల వఱకుఁ జూచి యెఱుంగరు. సేవకుఁ డెట్లున్నవాఁడని వాని గాయ మెట్లున్నదని రామరాజు దగ్గఱనున్న మనుష్యుల నడిగి వానిం బలుమారు చూడఁగోరెను. కాని పరస్పరదర్శ నము మాత్రము కాలేదు. వారు పల్లియ జేరిననాఁటి రాత్రియె రామరాజు బసచేసిన గృహమునుండి వెంకటస్వామిని మఱి యొక గృహమునకుఁ దీసికొనిపోయి తగిన చికిత్సలు జేసి వాని గాయము మాన్పి కొండగంగులుయొక్క యనుచరులు వాని కెల్లవిధముల నుపచారములు చేసిరి. అయిదవనాఁ డుదయ మున గంగులు కొందఱు అనుచరుల వెంటఁబెట్టుకొని రామ రాజున్నకడకు బోయి యిట్లనియె. "రాచచిన్నవాఁడా! నీ బంటు వెంకటస్వామికి గాయము కుదిర్చినాము. అతనికి నడువఁ గల శక్తి వచ్చినది. కాఁబట్టి యతనిని మీతండ్రిగారివద్దకు బంపి మాకీయవలసిన సొమ్ము తెప్పించవలసినది. వెయ్యి కఱకువరహా లిచ్చిన పక్షమున నిన్ను మేము విడిచిపెట్టెదము

మీతండ్రిపేర నీచేతితో నీవొకజాబు వ్రాసి యితనిచేతికిచ్చి యితనిచేతనే యాసొమ్ము దెప్పించవలయు. మీతండ్రి గోలకొండ నవాబువద్ద నుండుటచేత తనకుఁ బలము గలదు గదా యని నవాబు తనచేతిలో నున్నవాఁడని తనమాట చెల్లునని గర్వించి సేనలను గీనలను దీసికొని మాపల్లె ముట్టడించి మమ్ముఁ బట్టుకొని చంపించుటకై ప్రయత్నముచేయు నేమొ; సేనలు వచ్చుచున్న జాడ మాకు దెలిసినపక్షమున నీతల నీ మెడమీఁదనుండదని నిశ్చయముగ నమ్ముకొనుము. చెప్పినంత మాట చేసెదు వాఁడనేకాని నేను సందేహించువాఁడను గాను. ఈమాటలు మీ వెంకటస్వామితో నీవు గట్టిగా జెప్ప వలయు. అట్టిప్రయత్నము మీతండ్రి చేసినయెడల ముందు నీప్రాణములు తరువాత మాప్రాణములు బోవును. కాఁబట్టి మంచిచెడ్డలు నీవే విచారించుకొని యేప్రకారముగా జాబు వ్రాసి జవాబు తెప్పించవలయునో యాప్రకారము జాబు వ్రాసి సొమ్ము తెప్పించవలయును. నీయిష్టము వచ్చినమాటలు వెంకటస్వామితోఁ జెప్పుకొనవచ్చును. ఇదిగో నేను వెళ్ళు చున్నాను'' అని పలికి గంగులు సపరివారముగ రామరాజు సదనమునుండి నిష్క్రమించెను. అతఁడు తనగదిగుమ్మము దాఁటగానె రామరాజు తనలో నిట్లని వితర్కించుకొనియెను. ''ఏమీ! ఆంధ్రదేశమునందు క్షత్రియులలో పేరు ప్రతిష్టలు కాంచి గోలకొండ నవాబువద్ద గొప్పయధికారము వహించిన నరసింహరాజునకు, కుమారుఁడనై ఖడ్గప్రయోగమునందు

విలువిద్యయందు దుపాకిఁ గాల్చుటయందు మిక్కి లి నేర్పరి నై శౌర్యసాహసములకుఁ బలుమారు మిత్రులచే మెప్పువడసి విద్యావంతుఁడ నై యెట్లు కేలకు దారులుకొట్టు దొంగలు చెప్పి నట్లు విని ప్రాణములు దక్కించుకొనవలసిన వాడ నైతిని గదా. లంచమిచ్చి నా ప్రాణములు నేను దక్కించుకొనుటకు యుక్తమా? ఆజన్మాంత మిచ్చట నేను వీరి యధీనములో నేల యుండఁగూడదు. ఉండినపక్షమున నేమి ప్రయోజనము? దొంగలనా యడచినవాడనుగాను. తలిదండ్రులకా పుత్ర శోకము గల్గించినవాఁ డనగుదును. ఇక్కడనున్నను నాత్మ హాని చేసికొన్నను సమానమే. కావున స్వనాశనమునకుఁ గూడఁ గారణమగునను కాఁబట్టి యిక్కడుండుట యన్ని విధములచేత ననర్థదాయకము. పౌరుషము ప్రయోగింపవలసి నప్పుడు పౌరుషము ప్రయోగింపవలయును. కాలము తప్పి వచ్చినప్పు డుపాయముచేతఁ గార్యసాధనము సేయవలయును. తుచ్ఛప్రాణముల నిమిత్తమె ప్రతిష్ట బోఁగొట్టుకొందునా?'' శరీరమాద్యం ఖలుధర్మసాధన'' మ్మని మహానుభావుఁడగు కాళిదాసు వచించియున్నాఁడు. ఆకోరిక యథార్థాల నిజము. నరుఁడు జీవించియున్నపు డేధర్మమైన సాధింపఁగలడు. చచ్చి యేమిసాధింపఁగలడు. లోకోపకారార్థము చావవలసివచ్చిన పక్షమున నిర్విచారముగఁ జావవలసినదే. ఇందు లోకోప కార మేమియు లేదే. నేనిక్కడ నుండిపోతినా దొంగల యాగ డము లెప్పటివలె సాగును. అనేకుల కపకారము జరుగు చుండును. ఎట్లో యావలబడితినా యీదుండగుల దౌర్జన్య

ములు హెచ్చకుండ లోకమున కుపకారము సేయవచ్చును. నేను దొంగలతో జేసిన యొడంబడికప్రకారము కట్టుబడి యుండి లోకమున కుపకారము చేసెద. కాఁబట్టి నేను ధన మిచ్చి తప్పించుకొని పోవుట ధర్మమె. నేనెకాదు ఆబాలికను గూడ నెట్లయిన జెఱనుండి తప్పింపవలయును. ఆ జగన్మోహ నాకారమును బంధించుటకు వీనికిఁ జేతు లెట్లువచ్చెనోకదా. ఆమెనుగూడ నేను వదలించెదను. నాకు వేయివరహాలు నామెకొక వేయివరహాలు విడుపుధనము క్రింద వీరు పుచ్చు కొందురు. పాపము మాచిని మఱువఁగూడదు. దాసియయ్యు నెంతో నీతిగలిగి తన యజమానులు మృతినొందినను బిడ్డను గాపాడుటకై చెఱలోవచ్చియున్నది. దానిని గూడ వద లించెదను. ఆ బాలికపై నాకుఁగల యనురాగ మటుండఁగా నాకీ నాలుగు దినములనుండి వారుచేయుచున్న యుపచారము లకు నేను కృతజ్ఞతఁ జూపవలదా? కావున మాచిని వదలిం చెద. మామువ్వురకు మూడువేల వరహాలు పుచ్చుకొందురు. లక్షవరహాల కధిపతియైన నరసింహరాజు తనకుమారుని విడి పించుటకై మూడువేలవరహాల నియ్యఁడా? మూడువేలేకాదు ముప్పదివేలిచ్చును. అంతేకాదు తన లక్షవరహాలను దన ప్రాణములను దన తక్కిన యాస్థిఁగూడ నానిమిత్తమై ధార వోయును. కాఁబట్టి నేనింక జాబువ్రాసెదను.'' అని విత ర్కించుకొనుచుండ నంతలో వెంకటస్వామి వచ్చి యెట్ట యెదుట నిలిచి దండముపెట్టెను. అతని జూచి రామరాజు దిగ్గునలేచి ''వెంకటస్వామి! పాపము నిన్నుజూచి నాలుగు

దినములైనది. క్షేమముగ నుంటివా? మనయవస్థ యిట్లు వచ్చినది. కాని యచిరకాలములోనె మనకు మేలు చేకూరగలదు. బాబయ్యగారికి నేనొకజాబు వ్రాసియిచ్చెదను. అది పట్టుకొని నీవు వెళ్ళి బాబయ్యగారిచ్చిన సొమ్ము తీసికొనిరమ్ము" అని పలుక వెంకటస్వామి కంటనీరుబెట్టుకొని "మిమ్ము విడిచి నేను వెళ్ళగలనా? అమ్మగారితో బాబయ్యగారితో నేనేమని చెప్పుదు" నని విచారించెను. రామరాజు వానికి ధైర్యము చెప్పి యూరడించి బోనము పెట్టెనున్న యూరు గంటముం గైకొని యొకజాబు వ్రాసి వానికిచ్చి పంపెను.

---

## పదియేడవ ప్రకరణము

---

నాలు గిత్తడిదీప స్తంభముల యందు నాలుగు వ్రాత బల్లలయెదుటం గూర్చుండి నలుగురు గుమస్తాలు లెక్కలు వ్రాయుచుండిరి. వెండిబిళ్ళలుగల డవాలీలు మెడలో వైచుకొని యిద్దఱుబంట్రోతులు చేతులుజోడించికొని నేలజూచుచు స్తంభములవలె నిలువబడిరి. ప్రభుదర్శనము జేయుటకు సమయము నిరీక్షించుచు వీధియరంగుపై బదుగురు మనుష్యులు గూర్చుండి ప్రభువేమి జేయుచున్నాడని ద్వారపాలకుని దఱిచి తఱిచి యడుగంజొచ్చిరి. ఒక వెండిదీపపు స్తంభముముందు మెత్తలువేసిన యొకకుర్చీమీద దన కచ్చేరీ చావడిలోం గూర్చుండి కలిదిండి నరసింహరాజు నవాబు తనకుం బంపిన

కాగితముల గొన్నింటిని జూచుకొనుచుండెను. "వంటలైనవి, భోజనమునకు దయచేయవచ్చు" నని లోపలనుండి రెండు మూడుసారులు వర్తమానము వచ్చినను కార్యవ్యగ్రత చేత వినిపించుకొనక నరసింహరాజు తనపని దాను జూచుకొను చుండెను. అప్పుడు సింహద్వారమువద్ద నున్న ద్వారపాలకుడు గోపాలసింగు యజమానుని సన్నిధానమునకు వచ్చి మెట్టయెదుట నిలిచి ప్రభువు తలయెత్తి తన వైపు జూచునేమోయని కొన్ని నిమిషములు కనిపెట్టుకొని యుండ యాయన తనవంకఁ జూడనందున సాహసించి "రాజాజీ ? రాం రాం" అని సలాముచేసి చేతులుజోడించి నిలువబడెను. నరసింహరాజు కన్నెత్తి "యేమి కాగితములు చదువుకొనుచున్నానని తెలియదా" యని కోపదృష్టితోఁ జూచెను. "స్వామీ! క్షమియించవలయు, జరుగురుపని యుండబట్టి నేనింత సాహసించవలసె. కాకున్న దేవరవారిపని కడ్డము రాఁగలనా"యని యతఁడు మనవిచేసికొనెను. ఆతొందర పనియేమో తక్షణము చెప్పుమని నరసింహరాజు సెలవియ్య గోపాలసింగు "మహాప్రభూ! అబ్బాయిగారితో వెళ్లిన వెంకటస్వామివచ్చి తలవాకిటనున్నవాడు దేవరవారిని దప్పక యిప్పుడే చూడవలయునని కోరుచున్నాడు. దేవరవారిచిత్త" మని విన్నవించెను. విన్నవించినతోడనే నరసింహరాజు చేతి నుండి కాగితములు క్రిందజాఱిపోయెను. చదువుకొనుచున్నప్పుడు వంగియున్న మేను కుర్చీకిఁ జేరఁబడెను. కంఠస్వరము మారెను. ఏమిటీ! గోపాలసింగూ! వెంకటస్వామి యొక్కడే

వచ్చెనా ? అబ్బాయి రాలేదా ! సరిగాఁ జూచితివా ? అత డొక్కఁడే వచ్చినాఁడా ? పిల్లవా డెందులకు రాలేదో యడిగి నావా ? ఏమి జవాబుచెప్పినాఁడు ? క్షేమముగా నున్నాడా ? ఎక్కడనున్నాఁ" డని యొక్కనిమిషములో నెన్నోప్రశ్నల నతడడిగెను. "పేనేమియు నడుగలేదు సెలవైనయెడల వానిం దీసికొనివచ్చెద" నని సింగు బదులుచెప్ప "తక్షణమే తీసికొనిరా కాదుకాదు; నేనే వచ్చుచున్నానుండు" మని సింగు ముందునడున, దాను వాని వెనువెంట వెళ్ళి వీధి గుమ్మము ముందు నిలువబడియున్న వెంకటస్వామిని జూచి గోపాలసింగు నడిగినట్లె బహువిధప్రశ్నల నతఁ డడిగెను. ఆ ప్రశ్నలకు వెంకటస్వామి "అబ్బాయిగారు నిమ్మళముగా నున్నారండి. ఆయన స్వయముగ వ్రాసియిచ్చిన యుత్తర మేనండి యిది; చిత్తగించండి" యని జాబుచేతికివచ్చెను. కుమారుఁడు జాబు స్వయముగ వ్రాసియిచ్చినాఁడని వినిన తోడనెఁ యతఁడు క్షేమముగ నున్నవాఁడని నిశ్చయించు కొని ధైర్యము తెచ్చుకొని వానిని లోనికి రమ్మని విసవిస నడచి చావడిలోని కరిగి కుర్చీమీఁదఁ గూర్చుండి యిట్లని జాబు చదువుకొనెను. "బాబయ్యగారి పాదపద్మముల సన్నిధికి, మీకుమాళ్ళు రామరాజు నిత్య మనేక నమస్కారములుచేసి చేయంగల విన్నపములు నేను కుశలముగా నున్నాను. నావిషయమై మీరుభయపడనక్కఱలేదు కాని నేను ప్రయాణము చేయుచుండఁగా బాటసారుల వేషములు

వేసికొనిన దొంగలు నన్ను మోసపుచ్చి వారిగూడెములోనికిఁ దీసికొనిపోయిరి. నేనిప్పుడు వారిఖైదీగా నున్నాను. నాకంటె ముందె యిక్కడ నొకరాచచిన్నది దాసీతోఁగలిసి ఖైదీగా నున్నది. ఆమె సౌభాగ్యము మంచితనముఁజూడ మహారాజుల యింటఁ బుట్టవలసిన కన్యయవి నాకుఁదోచుచున్నది. ఆమెకు దలిదండ్రులు లేరఁట మూడవయేటనే ఖైదీగాఁ బట్టుకొనఁబడినదట. ఇప్పుడు పదిహేనుసంవత్సరములుకలవు. ఆమెయు నామెదాసియునాకన్నపానములిచ్చిసకలవిధములసంరక్షణము చేయుచున్నారు, వారివలననే నేను సుఖముగ నున్నాను. దొంగలగురువు కొండగంగులు; వానిపేరు మీరు వినియే యుండవచ్చును. వేయి కరకువరహా లిచ్చినపక్షమున నన్ను వదలివేయుదునని చెప్పినాడు. ఆసొమ్ము నిమిత్తమె మీవద్దకు వెంకటస్వామిని పంపినాను. విడుపుధనమిచ్చి యీతని బంపించ వలయును, ఈవిషయమున నాదొకమనవి యున్నది నాకంటె ముందునుండి చెఱలోనున్న రాచచిన్నదానిని దాసీసమేతముగ జెఱనుండి విడిపింపవలయునని నేను సంకల్పించు కొంటిని వారిద్దఱికిఁ జెఱియొక వేయివరహాలు విడుపుధనము కావలసి యుండును. ఆసొమ్ముగూడ మీరు పంపించిన పక్షమున నే నతిధన్యుఁడ నగుదును. పెద్దపులులవంటి కటికివాండ్రచేతిలో బడవలయుననియిష్టములేదు. స్త్రీని జెఱనుండివిడిపించుటకంటె బరమధర్మములేదు ధనము సంపాదించుట సులభముగాని కీర్తిపుణ్యములు సంపాదించుట కష్టము కావున నీ రాచచిన్న

దాని నెట్లయిన వదలించి నామనోరథము దీర్చి మీరు కీర్తి పున్నెముల సంపాదింపవలయునని వేడుచున్నాను. ఇట్లు ముప్పురను విడిపింపఁదలచుకొన్న పక్షమున మూడువేలు వరహాలు వెంకటస్వామిచేతఁ బంపుడు. ఈధనము దొంగల పాలు గాకుండ వెంకటస్వామి కైదుగురు గుఱ్ఱపుస్వారులను సాయమిండు. వారు దొంగలగూడెములోనికి రాఁగూడదు. వెంకటస్వామి యొక్కఁడే ధనము పట్టుకొని రావలయును. ఇందొకరహస్యము గలదు. నన్ను వదలించుటకై సొమ్ము నంపక దొంగలనుబట్టి శిక్షించుటకై మీరు సైన్యములను బంపఁదలతురేమో. అట్లు చేయవలదు. అట్లు చేసినపక్షమున వారు ముందు నన్ను జంపివేయుదురు. నేను సురక్షితముగ నిల్లు చేరినవెనుక దొంగల నేమి చేయవలయునో యాలోచింతము. అంతవఱకు వారి జోలికి బోవలదు. తక్షణమే ధనమిచ్చి పంపవలయును.

చిత్తగింపవలెను

కలిదిండి రామరాజు

ఫాల్గుణ శుద్ధ ౯ ఆదివారము

జాబు చదువుకొని నరసింహరాజు కొంతసేపటివఱకుఁ గార్యనిశ్చయము జేసికొనలేకపోయెను. తన కుమారున కంత మహాపకారముచేసిన దురాత్ములను బెబ్బులులను వేటాడినట్లు వేఁటాడి చంపివేయవలయునని మహాక్రోధోద్దీపితుఁడై యతఁడాలోచించెను, కాని కుమారుని క్షేమ మక్కడడ్డము వచ్చుచుండెను. అందుచే విక్రమముకంటె వివేకము ప్రయోగింప

వలసిన సమయమిదియే యని తెలిసికొని వ్రాఁతబల్లకడనున్న పరాబును బిలిచి తన ఖజానాలోనుండి మూఁడు వేల వరహాలను దీసి సంచులలోఁబోసి కట్టుమనియాజ్ఞాపించి గదితాళమిచ్చెను. పరాబుతోఁగూడ గోపాలసింగు వెళ్ళెను. పిమ్మట వెంకట స్వామిని కొన్ని ప్రశ్నలడిగి యచ్చటి స్థితిగతులుఁ గనుఁగొని తెల్లవాఱుజామున బయనమని చెప్పి భోజనముచేసి రమ్మని యానతిచ్చి తనకుమారునివార్త తనభార్యకు దెలిసినపక్షమున నామె దుఃఖాక్రాంతయై గోలచేయునని యది రహస్యముగ నుంచఁదలఁచుకొనెను. వరహాలు సంచులలోఁ బోసి కట్టి గది బీగమువేసి పరాబు, గోపాలసింగును వచ్చినతోడనె యతఁడు సింగునకిట్లనియె. "నీవు మఱి నలువురు గుఱ్ఱపుసరదారులు మన వెంకటస్వామిని వెంటఁబెట్టుకొని యీసొమ్ము దీసికొని వెంకటస్వామి తీసికొనివెళ్ళిన చోటికి వెళ్ళుఁడు. అతఁ డాఁగుమన్నచోట మీరాగుఁడు నిలుమన్నచోట మీరు నిలువుడు" అని తనకుమారుని వృత్తాంతమంతయు మెల్లగా నతనితోఁ జెప్పి తొందరపడవద్దని యానతిచ్చి । తెల్లవాఱుజామున ప్రయాణ సన్నాహము మీఁద రమ్మని యానతిచ్చెను. అనంతరము తానును భోజనమునకరిగి పిమ్మట శయనించెను. కాని నిద్ర సరిగాఁ బట్టలేదు. తెల్లవాఱుజామున గోపాలసింగు, సరదారులు వెంకటస్వామి వచ్చినతోడనె నరసింహారాజు మేలుకొని వెంకటస్వామితోను సింగుతోను జెప్పవలసిన మాటలు జెప్పి వరహాలసంచుల నిచ్చి దారిఖర్చులనిమిత్తము వారికిఁ గావలసిన ధన మిచ్చి పంపెను.

—

## పదునెనిమిదవ ప్రకరణము

ప్రథమపరిచయ మైనది మొదలుకొని రామరాజు కృష్ణవేణితో నిరంతరము ప్రొద్దు గడపవలయునని యభిలాష గలవాఁడయి సమయము జిక్కినపుడెల్ల నామె సన్నిధానమున కరిగి యేదో ప్రసంగము దీసికొనివచ్చి యామెచే మాట లాడించుచు నామె నోటనుండి వెడలు వాక్సుధారసంబుల జుఱ్ఱుకొనుచు హాయిగ గాలక్షేపము చేయుచు వచ్చెను. అట్టి ప్రసంగములలో నొక్కనాడు రామరాజు బాలిక నుద్దేశించి "కృష్ణవేణీ! ఈ చెఱనుండి నిన్నెవ్వరైనను విడిపించిన పక్షమున స్వేచ్ఛగా నుండుటకు నీకిష్టమున్నదా" యని యడిగెను. అంతలో మాంచి మాటసందర్భ మందుకొని "యంత పుణ్యాత్ము లెవరుందురు నాయనా? చెఱ వదలించెద మని చెప్పినపుడు వద్దనువారుందురా" యని బదులు చెప్పెను. "నాకుఁ దండ్రి లేఁడు. తల్లి లేదు. చెఱ వదలినతరువాత దిక్కులేనిదానను నేనెక్కడకుఁ బోఁగల" నని కన్నులనుండి రెండు వేడిబాష్పబిందువులు జాఱ కృష్ణవేణి ప్రత్యుత్తర మిచ్చెను. ఆకన్నీళ్ళు జాఱఁగానె రామరాజు హృదయము కలఁతజెందెను. "సుందరీ! దిక్కులేదనుకొని విచారింపకు. నేను నీకుదిక్కు. మాతలిదండ్రులు మిక్కిలి మంచివారు. నిన్నును మాంచిని జెఱనుండి వదలించుటకై రెండువేల వరహాలను, నన్ను వదలించుకొనుటకు వేయి వరహాలను

బంపవలసిన దని మాబాబయ్యపేర జాబు వ్రాసితిని వెంకట స్వామి త్వరలో సొమ్ము దెచ్చును. మనము ముప్పురము విముక్తులమై పోవుదము. నీవు వివాహమగువఱకు మాయింటనే యుండవచ్చును. మాబాబయ్య నీకు సకల సౌఖ్యములు నొనగూర్చు" నని రామరాజు మర్మము విడిచి హృదయమున నున్న కోరికలో గొంత యడంచి కొంత వెలిబుచ్చెను. వివాహముమాట తలపెట్టగానె కృష్ణవేణి సిగ్గునఁ దలవంచి యూరకుండెను. అప్పుడు మాచి "నాయనా! నగలా, నాణెములా, దిక్కుమాలిన యీపేదపిల్లను జేసికొనువా రెవ్వరు? దైవ మేమేర్పరచినాఁడో యేమి చెప్పగలము. మా యమ్మాయి పున్నెము బాగుండిన నిక్షేపమువంటి తండ్రి, బంగారువంటి తల్లి యెందుకు నేలపాలై పోదురు బాబూ" యని మరేమియు మాటాడలేక వెక్కివెక్కి యేడ్చెను. ఆమె విచారము జూచి రామరాజు జాలినొంది "మాచీ! విచారింపకు. సమస్తము శుభ మగును. కంట తడిపెట్టకుము. గంగులుతో నేను మాటలాడి మిమ్ము విడిపించెద" నని యభయ మిచ్చి యవ్వలి కరిగి గంగులు నిమిత్తమై వెదకెను. గంగు లప్పుడు గృహమందు లేకపోవుట జేసి మాటలాడుటకు వీలు చిక్కదయ్యె ఆమరునాడు రామరాజు గంగులును గలిసికొని ప్రస్తావవశంబున నిట్లనియెను. "నన్నువిడిచినట్లె యీ బాలికనుగూడ విడువదలఁచుకొన్నారా? తలచుకొన్నపక్షమున నెంత విడుపుధనము మీకు గావలయును? ఏదో మొత్తమేర్పరచినపక్షమున నేను మాయింటివద్దనుండి ధనము

తెప్పించి వీరిని విడిపించెదను'' అనుచుండగనే గంగు లడ్డము వచ్చి "నేనామెను విడిచిపెట్టను. నాకొడుకు నాగులున్నాడు. ఆపిల్లవానికి దీనిని పెండ్లిచేయుదును. కనుక యీ మాట యెత్తవద్దు. నీదారిని నీవు పో. వాళ్ళజోలి యెందు'' కని గంగులు నిష్కారణముగ బ్రత్యుత్తరమిచ్చి చివాలున లేచి పోయెను ఆపలుకులు వినగానె రామరాజుగుండెలు చెదరి పోయెను. మనోరథమెల్ల భగ్నమయ్యెను. ఆశ లడుగంటెను. "ఛీ! ఈమెను వెంటబెట్టుకొని వెళ్ళనిపక్షమున నేనిక్కడ నుండి పోనేల ? ఆమె లేనబ్రతుకు బ్రతుకా? ఆమెను విడిచి జీవచ్ఛవమునై గోలకొండలో నుండుటకంటె నీ దొంగల గూడెములోనెనా పాడుజీవితము గడపరాదా? వ్రతముచెడి నను ఫలమైన దక్కదే ఇక్కడినుండి యీమెను వివాహము చేసికొందమన్న నట్లును వీలులేదు. ఈమెను వీడు తన కుమారున కిచ్చి పెండ్లిసేయునట; కాకిముక్కునకు దొండ పండు కట్టుటకు యను మాట యిందు సార్థక మగుచున్నది. ఈమె నన్ను జేపట్టినను సరే; చేపట్టకున్నను సరే; యీమెను మాత్రము వీనిబారినుండి తప్పించవలయు. కావలసిన ధనము గ్రహియించి గంగులు తన్ను విడిచిపుచ్చి నావెంట పంపు మని బాలిక కొండంతయాశపెట్టుకొని యున్నది. వాడు విడువడని యామెతో నెట్లు చెప్పుదును. ఇది విని యామె యాత్మహత్య జేసికొనునో, యడవిపుష్పమువలెఁ గ్రమ క్రమముగా జీర్ణమై యిక్కడ సమసిపోవునో, దురాత్ముఁడను

నేనామె కీవట్టియాశ యేల కలిగించితిని. ఆహాహా! యిప్పుడు కర్తవ్యమేమి? సరే కాని, నేను ముందు విరక్తుఁడనయి గోలకొండకుఁబోయి బాలికా! విమోచనార్థము పనిచేసెద" నని రామరాజు తనలోఁ దాను దలంచుకొని కొంతసేపటికి లోని కరిగి యెప్పటివలె సుముఖుఁడై యుండక విచారా క్రాంతుడై యుండెను. అతని మొగము జూడఁగానే కృష్ణ వేణికిఁగూడ విచారము కలిగెను. ఆతని వాలకముజూచి మాచి "బాబయ్యా! యే మిట్లున్నా" రని యడిగెను. ఆ పలుకులు వినఁగానె యాతనికన్నులనుండి నీరు కారెను మంద భాగ్యుల మగు మామూలమున మీా కేమైన చిక్కులు సంభ వించినవా యని కృష్ణవేణి మృదుస్వరముతోఁ బలికెను. ఎట్ట కేలకు రామరాజు తన విచారము నాఁపుకొని వారివిడుదలను గూర్చి గంగులు చెప్పిన మాటలు జెప్పెను. "నిర్భాగ్యులను బాగుచేయువాఁడుండ" రని కృష్ణవేణి విచారసూచక మయిన కంఠస్వరముతోఁ బలికెను. "నాతల్లి! యడవిలో మన మీా కిరాతుల చేతులలోఁ బడిపోవలసిన దేనా" యని మాచి కృష్ణవేణిని కౌగలించుకొని యేడ్చెను. రామరా జామె నూఱ డించి యిట్లనియె. "మీారీవిషయమున విచారింపకుఁడు. నేను గోలకొండ కరిగి నెలదినములనాటికి మిమ్ముఁ దీసికొనిపోయెద. నాకు దుఃఖ మిప్పుడు కంఠపూర్తిగనున్నది. ఇంత కంటె నేనేమియుఁ జెప్పజాల. నామాట మీారు నమ్మియుండుఁడు. ఇది రహస్యముగ నుంచుడు" అని చెప్పినాఁడు. తిన్నగా భోజనముచేయక నాలుగు మెతుకులు కతికి యావలకుఁ

బోయెను. సాయంకాలము వెంకటస్వామివచ్చి సొమ్ము తెచ్చి యూరుబయట గుఱ్ఱపుసవారు లయిదుగురు సిద్ధముగనుండిరని చెప్పెను. అదివిని రామరాజు "గోపాలసింగు, నీవు మాత్రము వేయివరహాలను దీసికొని యిక్కడకు రం" డని చెప్పెను. సరేయని వాఁడు వెళ్ళి రాత్రి జా మగునప్పటికి గోపాలసింగును వెంటఁబెట్టుకొని వరహాలసంచి భుజముపైఁ బెట్టుకొని వచ్చెను. అతఁడు రాగానే రామరాజు గంగులును బిలిచి వేయివరహాలు లెక్కించి యాతనికిచ్చి దెల్లవాఱుజామునఁ బోవుటకు సెలవిమ్మని యడిగెను. సరేయని గంగులు నీప్రతిజ్ఞ జ్ఞాపకముంచుకొమ్మని వానికి జ్ఞాపకముచేసి పొమ్మని సెలవిచ్చెను. అనంతరము రామరాజు కృష్ణవేణిని గలిసికొని తన పయనము మాట జెప్పెను. ఆమె అధిక దుఃఖాక్రాంతయై యుండెను. మాచియు రోదనము చేసెను రామరాజు కంఠపూర్తియయిన దుఃఖము నెట్టెటో యాపుకొని "భయపడవద్దు. నెలదినములనాటికి నీవు నా యంతఃపురమున నుందువు, నిరాశజెంది సాహసములు చేయవద్దు. నాకంఠములోఁ బ్రాణములుండగా మీకు భయములే"దని ధైర్యము జెప్పి గోపాలసింగును దీసికొనిపోయి కృష్ణవేణిం జూపి వారి పూర్వవృత్తాంతము జెప్పెను. గోపాలసింగు కృష్ణవేణిం జూడఁగా నాతని మన స్సెందుచేతనో పరిపరి విధములఁ బోయెను. పోవుటయు నాతఁ డెన్నోప్రశ్నలవేసి కృష్ణవేణిని, మాచిని మిక్కిలిగ పోల్చిచూచి నిట్టూర్పువిడిచి దుఃఖ మాఁపుకొని రామరాజును

వెంటబెట్టుకొని యావలకుఁ బోయెను. తెల్లవాఱుజామున రామరాజు, వెంకటస్వామి, గోపాలసింగు బయనమై పోయిరి. రామరాజు తన వెనుకటి గుఱ్ఱముమీఁదనె యెక్కి పోయెను. అంతట వారూరుబయటనున్న సవార్లం గలిసికొని గోలకొండకుఁ బయనమైపోయిరి. గోలకొండ చేరినతోడనే తలిదండ్రు లాతని జూచి పొందిన యానంద మింతింత యని చెప్పనలవి కాదు. కృష్ణవేణియు మాచియుఁ దన వెంట రాక పోవుటకు రామరాజు తండ్రితోఁ గారణముజెప్పి తాను దొంగలతోఁ జేసిన ప్రతిజ్ఞ జెప్పి తన ప్రతిష్టకు భంగము కలుగకుండ వారిని రావించుట కుపాయము వెదకవలసినదని దండ్రిని బురికొల్పెను.

---

## పందొమ్మిదవ ప్రకరణము

"అతఁడు పెట్టిన గడువు గడచినది. నెలదినములు గతించినవి. ఇంక నతఁడు వచ్చునని నిశ్చయముగా నెట్లు చెప్ప గలను? ఆశాబంధ మింక ద్రెంపవచ్చును. నా వెఱ్ఱిగాని యా మహాత్మునకు నేను జ్ఞాపకమా? ఆ తలిదండ్రుల యాదరణము క్రింద నుండి యత్యంత సుఖప్రదాయకములగు మేడలపై మిద్దెలపై వసియించుచుఁ బువ్వుఁదోటఁలలో విహరించుచు నానాచిత్ర విచిత్ర భాజనములైన గోలకొండవీధులలో సంచరించుచు నెచ్చెలులతో సరససల్లాపగోష్ఠి ప్రవర్తించుచు

భూలోకస్వర్గ మనుభవించు నరసింహరాజు కుమారుం డెక్కడ? తల్లిదండ్రుల యాదరణ మేమో యెఱుంగక సుఖ మెట్టిదో చవిజూడక చిన్ననాటినుండి చెఱలో నుండియున్న మందభాగ్యురా లెక్కడ? నావంటిదాని కెన్నఁడు నదృష్టము పట్టదు. అదృష్టమున్న పక్షమున నంత గారాబమున నన్ను బెంచిన తల్లిదండ్రు లేకకాలమున నేల మృతినొందుదురు? అదృష్టహీనమైన యీ జన్మము తుదముట్టించుట సర్వోత్త మము కాని మాచి నేమిచేయుదును? దాని నిమిత్తమై నే నిప్పుడు బ్రతుకవలసియున్నదానను. దాని నే దేని వంకమీఁద గోల్కొండకు బంపి నేను నా తలిదండ్రులం గలిసికొనుటకు బ్రయత్నము చేసెదనుగాక! ఎల్లకాలము దుఃఖభాజనమైన దేహము తనకు నితరులకుఁ గూడ మహాభారము'' అని యొక నాఁటిరాత్రి కృష్ణవేణి తలపోయుచు నొకగోడకుఁ జేరఁబడి కూర్చుండ నంతలో మాచి సమీపమున కరిగి ''అమ్మా! ప్రొద్దుపోయినది. పండుకొందమురా'' యని చేయిపట్టుకొని యామెను లేవదీసి మంచము మీఁదికిఁ గొనిపోయెను. తన దుఃఖము మాచి యెఱిగినపక్షమున నది మిక్కిలి వగచు నను భయమున దానికిఁ దన మనోగతవిషాద మెఱిగింపక దానివెంట నట్లనఁ జని మంచముపైఁ బరుండెను. కాని కన్ను మూఁత పడలేదు. అప్పు డప్పుడు వేఁడిబాష్పములు కొలఁకుల నుండి దొరఁగుచుండెను. ఓదార్చువారు లేనప్పుడు దుఃఖము దానంతటదియే యుపశమించునుగదా. తలనిండ తలంపులు

పెట్టుకొనియున్న యా కృష్ణవేణికి నిముసములు జాము లయ్యెను. తానుతప్ప నెల్లవారు నిద్రపోవుచుండిరి. గూడె మంతయు నిశ్శబ్దముగ నుండెను. అప్పటికి రమారమి రెండు జాములయ్యెను. కృష్ణవేణి యొక గదిలోఁ బండుకొనియెను. తాను దొంగలగుంపులోనె కాపురముచేయు చుంటచే వేరు దొంగలభయ ముండదను ధైర్యముతో చల్లగాలికై గది తలుపులు దీసి పండుకొనియెను. నిదురపట్టకపోవుటచే నామె లేచి మంచముమీఁద గూర్చుండి దొడ్డివైపు చూచుచుం డెను. దొడ్డిగోడమీఁద నిద్దఱు మనుష్యు లెక్కియున్న ట్లామె కంటికిఁ గనఁబడిరి. ఎవరువా రని యామె కేకవేసెను. అంతలో నొకఁడు గోడదిగి "నేను రామరాజు బంటును; గోపాలసింగును. అఱవబోకు"మని యుత్తరవుచెప్పి యామె కడకువచ్చెను. అంతలో రెండవవాఁడు తన్నుఁ గలిసికొనెను. కృష్ణవేణి యది కలయో నిజస్థితియో తెలిసికొనలేనంత విభ్రాంతినొంది తెల్లబోయి చూడసాగెను. భయసంభ్రమము లచే మూచినిలేపుటకైన నామెకుఁ దోచదయ్యెను. అప్పుడు గోపాలసింగు "బిడ్డ! ఆలోచించుకొనుటకు బ్రశ్నలడుగుటకు వ్యవధిలేదు. నీనిమిత్తము మూచి నిమిత్తము రెండుపల్లకులు వచ్చి సిద్ధముగానున్నవి. మూచిని మేలుకొలుపు. ఈగోడ దాఁటించి మీయిద్దఱి బల్లకులలోఁ గూర్చుండఁబెట్టెద. తరువాత దొంగల గుంపును బట్టుకొందుము ముందే దొంగలపైఁ బడితిమేని వారు మీకు హానిచేయుదురని శంకించి యిట్లు చేసితిమి. ఈగోడ యంత యెత్తుగాలేదు. చులకనగా

దాటించెదము'' అని కృష్ణవేణితో రహస్యముగఁ జెప్పెను. ఆపలుకులు విని యామె చేతితోఁ దట్టి మాచిని లేపెను. ఆమె కన్నులు దుడుచుకొనుచు లేచి యెదుటనున్న మనుష్యులను జూచి ఓలమ్మో దొంగలమ్మో యని యఱవంబోవఁ గృష్ణవేణి చేతితో నోరుమూసి ''రామరాజు మననిమిత్తము పంపిన బంట్లుకాని దొంగలుకారు. మనము వారితో నిప్పుడు బల్లకిలోనెక్కి వెళ్ళవలెను. కేకలు వేయకు'' మని చెవిలోఁ జెప్పి దానిని లేవదీసెను. గోపాలసింగు వాని పరిచారకుఁడు మెల్లగ వారిని గోడదాటించి యక్కడ కిరువది గజములు దూరములో నున్న పల్లకుల నెక్కించిరి. వారెక్కగానె బోయలు పల్లకుల నెత్తిరి. వారితోఁగూడ నిరువదిమంది గుఱ్ఱపురౌతులు నొక సరదారు బత్తెపుఖర్చుల నిమిత్తము కొంత ధనము గోపాలసింగువద్ద గ్రహించి బయలుదేరిరి. వారుసాగి వెళ్ళగానె గోపాలసింగుయొక్క యుత్తరువు ప్రకారము ఫిరంగి కాల్పఁబడెను. ఆఫిరంగి ధ్వనితో గూడె మందలి మనుష్యు లందఱు నొక్కసారిలేచిరి. కొండగంగు జగన్నాథదాసు మొదలగువా రందఱు మేలుకాంచి తలుపు తీసి చూచునప్పటికి నలుప్రక్కల తుపాకులు ధరించిన సిపాయిలు వారికిఁ గనఁబడిన మగవానినెల్ల పట్టుకొని త్రాళ్ళతో రెక్కలు విఱిచి కట్టిరి. కొండగంగులు విండ్లు నమ్ములు తెచ్చుకొనుటకుఁగాని కత్తిచేపట్టుటకుగాని తన మొండిప్రతాపము జూపుటకుగాని వ్యవధిలేకపోయెను. స్త్రీలు శిశువులు

మహారణ్యము బ్రతిధ్వనిచేయునట్లు మిన్నుముట్టినట్లు నేడువం జొచ్చిరి. ఒక్కక్షైనను సిపాయిల నెదిరించిన పక్షమున నాతఁడు యమపురి పక్షమున నాతఁడు యమపురి కరిగియె యుండును. మొత్తముమీఁద నూరుమంది మగవాండ్రు గోల కొండ సైనికులచే జిక్కిరి. వారినందరను జేతులు విఱిచికట్టి గోపాలసింగు మొదలగు సరదారులు గోలకొండకు దీసికొని పోయిరి. నరసింహారాజు వారిని సంహరింప సంకల్పించెను. కాని రామరాజు తండ్రి కట్లనియె. "బాబయ్యగారు! నేను కొండగంగులు మొదలగు దొంగల ప్రాణములు తీయనని ప్రతిజ్ఞ జేసితిని. ఆప్రతిజ్ఞమీఁదనే వారు నన్ను విడిచిరి. కావున నాప్రతిజ్ఞ మీరు పరిపాలింపవలయు వీరి ప్రాణముల దీయక వీరిని చెఱసాలలో నుంచుడు. నాప్రతిజ్ఞయు నెర వేరును. లోకమున కుపకారము గలుగును" కుమారుని యందలి ప్రేమాతిశయముచే నరసింహారాజు తానాపాతో మాటలాడి వారిని యావజ్జీవము బందెలలో నుంచునట్లు రాజశాసనము దెప్పించెను.

---

## ఇరువదవ ప్రకరణము



కృష్ణవేణియు, మాచియు, నరసింహారాజు గృహము ననే పల్లకులు దిగిరి. నరసింహారాజుభార్య మంగయ్య కృష్ణ వేణిని గడుంగడు నాదరించి లోనికి దీసికొనిపోయెను. ఆమె లావణ్యము జూచినతోడనే యామె తనకోడలైన బాగుండు

నని మంగయ్య తలంచెను. ఆమె వచ్చిన నాలుగైదు దినముల తరువాత మంగయ్య కృష్ణవేణియొక్క సౌజన్యత శాంతస్వభావము మొదలగు సద్గుణంబులంగని యామె నెట్లయిన కొడుకున కిచ్చి వివాహము చేయవలసినదని భర్తను బ్రార్థించెను. కృష్ణవేణి పాణిగ్రహణ మెప్పుడు గలుగునాయని రామరాజు ఉవ్విళులూరుచుండెను. కృష్ణవేణియు రామరాజు చెట్టబట్టవలయునని కార్యఘటనము నిమిత్తమిష్టదేవతలం బ్రార్థించుచుండెను. నరసింహరాజు రామరాజు మనోభీష్టము నతని చెలికాండ్రవలన విని సంతసించి వివాహమునకు సుముహూర్త మేర్పరచి బంధువర్గమునకు శుభలేఖలు వ్రాసి పంపెను. కొండపల్లెనుండి రామరాజుయొక్క మేనమామ సకుటుంబముగ వచ్చెను. పుట్టుడురోగమువచ్చి బ్రతికి బయటబడి మరల తన కంటఁబడిన సోదరునిజూచి మంగయ్య పరమానందభరితయయ్యెను. తమ్ముడు మరణమునుండియుఁ గుమారుఁడు చెఱనుండియుఁ దప్పించుకొని వచ్చినందుకు బంధువులు మంగయ్య యదృష్టమును శ్లాఘింపఁజొచ్చిరి. అనేకస్థలములనుండి చుట్టములు మిత్రులు చిరకాలాశ్రితులు వివాహమునకువచ్చిరి. రామరాజు యొక్క మేనమామ భార్యతో నొక క్రొత్తస్త్రీ వచ్చెను. ఎవ్వరడిగినను నామె తన పూర్వవృత్తాంతమును సరిగాఁ జెప్పదయ్యెను. ఎందుచేతనో కృష్ణవేణిమీఁద మాత్ర మపరిమితప్రేమ గలిగియుండెను. ఆమె కృష్ణవేణి గూర్చుండిన చోటనే కూర్చుండును. ఆమెప్రక్క నే పండుకొనును. ఆమెకుఁ దల దువ్వును. బొట్టు

కాటుక పెట్టును. పలుమారు ముద్దాడును. అమ్మా, నీ తండ్రికి నిన్ను జూచుభాగ్యము లేకపోయెగదే యని తలుచు కన్నులనీరు నించుచుండును. ఆమెను జూచి మాచి రెండు మూడు సారులు "అమ్మా! నిన్నెక్కడనో చూచినట్లున్నది" అని మరల "మనిషినిబోలిన మనిషి యుండదా" యని తనకుదానే బుద్ధిచెప్పుకొని యూరకుండెను. ఆమె యాభరణములు తాల్చక వితంతుశీలము స్వీకరించెను. మనసు పట్టజాలక యొకరిద్దరామె నెవరమ్మా యని యడిగిరి. కాని యామె తాను క్షత్రియస్త్రీనని మాత్రము మఱియేమియుఁ జెప్పదయ్యె. కృష్ణవేణి వృత్తాంతము మాత్ర మామె సర్వము బంధుగులవలన వినెను. వివాహదినమునకుఁ బూర్వ దినమున నరసింహరాజు బంధుమిత్ర పరివృతుఁడై బాలికకుఁ గన్యాప్రదానము సేయువారెవ్వరు లేరుగదా యెవరిని పీటల మీఁద గూర్చుండఁబెట్టుదమని యాలోచించుచుండగా గోపాల సింగు వానిని సమీపించి చేతులు జోడించి నిలువంబడి యిట్లనియె. "రాజా! ఆమెకు నేను కన్యాప్రదానము జేయుదును. ఆమె నాబిడ్డ. నేనామె తండ్రి రంగరాజును నేను బెజవాడ నుండి బయలుదేఱి గోలకొండకు వచ్చుచుండ దొంగలు కొట్టిరి. దెబ్బలుతిని నేను నేలఁబడితిని. నేను జచ్చితిననుకొని దొంగలు నన్ను విడిచిపోయిరి. తరువాత నాకు స్మృతివచ్చె. ఒక బండివాఁడు కరుణించి నన్ను గోలకొండకుం దీసికొని వచ్చెను. ఆలుబిడ్డల గోల్పోయి సన్యాసివలె నుండుటచే నా కులగోత్రంబులదాఁచి గోపాలసింగను పేరుతో బొందిలీవేషము

వేసికొని నేను మీవద్ద సేవ జేయుచుంటిని. అబ్బాయిగారి నిమిత్తము పసుపుధనము నేను పట్టుకొని వెళ్ళినప్పుడు దొంగల గూడెములోఁ గృష్ణవేణింజూచి నాపూర్వసేవకురాలగు మాదిం జూచి యది నాబిడ్డయని యూహించుకొని త్రోవలో రామరాజునడిగి నాయభిప్రాయము నిజమని తెలిసికొని యింత వఱకు కొట్టుటలో యోపికపట్టి నేను మీకు సమస్తము విన్నవించితి. గుణవంతురాలగు నాభార్యను గోల్పోతిని" అని బాష్పాకులిత నేత్రుఁడై కూర్చుండెను. అక్కడ నున్నవారందఱు నక్కథనంతయు విని సంతసించిరి. అనంతరము నరసింహారాజు లోపలి కరిగి భార్యతో నవృత్తాంతము చెప్పెను. ఆమె మహానందము నొంది కృష్ణవేణికిఁ దల్లి తేకపోయెనగదా యని విచారించెను. పిమ్మట నరసింహారావు జవ్వాది కస్తూరియు మంగళ్యము బంధుస్త్రీలను చుట్టుంగూర్చుండఁ జేసికొని బెజవాడనుండి వచ్చిన క్రొత్తయువిదను పూర్వవృత్తాంత మెఱింగింపు మని తఱచి తఱచి యడిగెను. ఆమె యిట్లనియె. "అమ్మా! నేను కృష్ణవేణితల్లిని. కీర్తిశేషులైన నాభర్తగారు నేను మాకృష్ణవేణి సేవకులతో గలసి గోలకొండ వెళ్ళుచుండ త్రోవలో దొంగలుకొట్టి భర్తగారిం జంపిరి. అవమాన శంకచే నేను పొడిచికొంటిని, కాని నాప్రాణము పోదయ్యె. తరువాత మాసేవకుండగు నీలిగాడు నన్నొక బండిమీఁద వేసికొని కొండపల్లి జేర్చెను. పొడిచికొన్నప్పుడు ప్రాణము పోకపోవుటచే నేనేవో శుభములు జూచుటకే జీవించియుంటి నని నిశ్చయించుకొని … పంద్రెండు సంవత్సరములు గాల

క్షేపము చేసితిని. బ్రతికియున్నందుకు నాబిడ్డను జూచితినిగాని "యయ్యో భర్తగారు భర్తగా"రని వెక్కి వెక్కి యేడ్చెను. "అయ్యో! విచారింపకు. నీభర్తగారు మావద్దనేయున్నారు" అని మంగయ్య పలికెను. పలుకగానె నిజమా యామాట నిజమా యేదీయేదీ యని యామె వెఱ్ఱిబోయి నేనమ్మజాల ననియెను. అప్పుడు మంగయ్య లోపలనుండి కృష్ణవేణిని చావడిలోనుండి రంగరాజును పిలిపించి యామె యెదుట నిలువంబెట్టెను. ఆయానందమేమి చెప్పుదును. ఆదుఃఖమేమని వర్ణింతును. ఆయాశ్చర్యమెట్లని వ్రాతును. మనసున కష్ట రసము నిజముగా వర్ణించుశక్తి లేదు. మనసునకే తెలిసిశక్తి చేతికిఁ గలమునకుఁ గలుగునా? వారొండొరుల కౌఁగిలించు కొనిరి. ఆనందబాష్పముల విడిచిరి. పూర్వవృత్తాంతములం దఱచి యడిగిరి. ఒండొరుల కష్టము విన్నప్పుడు విషాదము, మేలు విన్నపుడు సంతోషము మేరమీరి పొడమెను. అదిన మంతయు నట్లు ముచ్చటించి చిరవియోగదుఃఖమును మఱచి మహానందసముద్రములో నోలలాడిరి. మఱునాఁడు సుముహూర్తమున రామరాజు కృష్ణవేణిని వివాహమాడెను. తలిదండ్రులు కాళ్ళుకడిగి కన్యాదానముచేసిరి. నవాబు దంపతులకు వెలలేని బహుమానముల బంపెను. దంపతు లపారము లేని యానందసముద్రమగ్నులై తలిదండ్రులకు ఇష్టములకు మహానందము గలిగించుచు నుభయవంశములకు బ్రతిష్ఠ దెచ్చుచు జిరకాలము జీవించిరి.

సంపూర్ణము

---